

"శరవణభవ"




నిరతానంద, నిరామయా, నిరుపమా, నిర్ద్వంద్వ, నిర్మోహనా,
నిరహంకార, నితాంతభూరివిభవా, నిర్వాణసంధాయకా
నిరవద్యా, నిగమాత్మ, నిష్కలుష, నిర్నిద్రప్రభావోదయా
పరిరక్షింపవె, భక్తవత్సల, దయాపారీణ, షాణ్మాతురా!



శతక కర్త

**అగస్త్యరెడ్డి వెంకురెడ్డి**

శ్రీ విఘ్నేశ్వరాయనమ:
శ్రీమత్పరదేవతాయై నమ:
శ్రీ మద్బాలసుబ్రహ్మణ్యేశ్వరాయనమ:

# ఆత్మీయము

"షాణ్మాతుర స్తవము" అను ఈ శతకము చాల కాలము క్రిందట విరచింపబడినది. మూడు వందలు (త్రిశతి) పై చిలుకు పద్యాలతో రచింపబడిన ఈ శతకము దురదృష్టవశాత్తు విలువైన అనేక గ్రంథరాజములతో పాటు, బాల్యములో వ్రాయబడినకొన్ని శతకాలు, ఖండకృతులు, నాటికలు నా ప్రమత్తత వలన క్రిమిదష్టమై సంవేదనకు గురి కావించినది. పుస్తకాలు అచ్చొత్తించాలనుతలంపు ఉండేదికాదు. ఒక విధమైన నిర్లిప్తతే కారణము.

ఎట్టకేలకు ఆయావ్రాత ప్రతులలో కొంచెం మిగిలియున్న కాగితాలను వెలికి తీసి పద్యాలు మున్నగునవి కొంతమేర మరల లభించినంతవఱకు యథాతథముగా వ్రాసి ఉంచుకోవడమైనది. సహృదయ కవి పండిత మిత్రులు, నెచ్చెలికాండ్రు పదే పదే ప్రోత్సహించడం వలన ఇప్పుడీ శతకమును 122 పద్యాలతో మదుపాస్యదేవత శ్రీబాలసుబ్రహ్మణ్యేశ్వర దేవదేవుని కృపాకటాక్ష వీక్షణములతో ప్రకటింపగలుగుచున్నాను.

1959 సంవత్సరములో నేను బి.ఏ. చదువుచున్న రోజులలో కొన్ని రోగములు కబళించి కారించుచున్న సమయమున ఒకనాడు అప్రయత్నముగ ఆశువులో ఈ క్రింది పద్యము స్ఫురించినది.

'ఆరోగ్యంబది నాటి నాటికిని అత్యంతంబు క్షీణింపగా
నారంభించుచునున్న ఈ సమయమందన్యాయచేతస్కులౌ
వారేరీతిని నిందలన్ సతమునాపై మోపి, దుశ్చింత, నన్
ఘోరంబౌగతి పల్కనేర్తు రొ? దయాకూపార! షాణ్మాతురా"

"షాణ్మాతురా" అను మకుటముతో శతకము వ్రాయుమని శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర దేవదేవుడు అనుగ్రహించుచున్నాడా! అను ఆశ్చర్యముతో పరవశించిపోయాను. నమ్మండి నమ్మకపోండి. జరిగిన వాస్తవమిది. అంతే ఒక నెలరోజులలో మున్నూటికిపైగా పద్యాలతో శతకాన్ని పూర్తి కావింపగలిగాను. ఇందు నా ప్రతిభ

ఏమాత్రము లేదు. బాల సుబ్రహ్మణ్యేశ్వరుడు ఆవేశించి వ్రాయించారనే ప్రగాఢ విశ్వాసం. ఇన్నేళ్ళకు, ఇన్నాళ్ళకు తెలుగు చదువరులకు ఇంతమాత్రమైన ఈ శతకమును అందింప గలుగుచున్నందులకు పరమానందముగనున్నది.

ఈ పద్యములలో కొన్ని ఆకాశవాణి విజయవాడ కేంద్రముండి 'కార్తికేయ స్తవము" అను పేరుతో ప్రసారమైనవి. కొన్ని పద్యాలు "షాణ్మాతురా! అను పేరుతో "శ్రీనాగేశ్వర మహావిభూతి" (శ్రీ నవ నాగ నాగేశ్వర ఆలయ ప్రతిష్ఠామహోత్సవ ప్రత్యేక సంచిక (విశ్వజనని పరిషత్– జిల్లెళ్లమూడి వారు ప్రచురించిన)లో ప్రచురింపబడినవి. వారికి కృతజ్ఞతాభి వందనములు.

శ్రమకోర్చి నా అభ్యర్థనను మన్నించి నాయీ శతకమును ఆమూలాగ్రము పరిశీలించి జారుపాటులను సవరించడమే కాక "ప్రతిస్పందన" పేరుతో చక్కని పీఠిక వ్రాసి అనుగ్రహించిన సాహితీ మిత్రులు "ఉపన్యాస చతురానన", "సాహితీ వాచస్పతి" శ్రీమాన్ మొవ్వ వృషాద్రిపతి గారికి, "నివేదన" పేరుతో అభిప్రాయమొసగి ఆశీర్వదించిన శ్రేయ:కాములు "వాచస్పతి", "శిరోమణి", "మహామహోపాధ్యాయ" డా॥ సముద్రాల లక్ష్మణయ్య గారికి, "ఆత్మనివేదనము" పేరుతో తమ హృదయ సంస్పందనను పంపి ఆశీర్వదించిన ఆప్తులు "ఆర్ష విద్యాసాగర", "మధురభారతి" శ్రీమాన్ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి గారికి, "అభినందనము" పంపి ఆశీస్సులందించిన "చారిత్రక నవలా చక్రవర్తి" నా శ్రేయస్సు నాకాంక్షించు ఆచార్య ముదిగొండ శివప్రసాద్ గారికి, ''శాణానుల్లీఢమణీ! వేంకురెడ్డీ! జయహో'' అంటూ ఆప్యాయతను ప్రవర్షించిన ''రామాయణ ప్రవచన సుధాకర'' ''రామాయణ సుధానిధి'' డా॥మైలవరపు శ్రీనివాసరావు గారికి, నిరంతరము నా యోగక్షేమాలు పరామర్శిస్తూ ఆశీరక్షతలు నాపై వర్షించు గురుతుల్యులు, ఈనా శతకమును ఆమూలచూడము పరిశీలించి కొన్ని సవరణలు కావించి వాత్సల్యముతో "గీతమాలిక" ప్రసాదించిన "కవిశేఖర" "విద్వత్కవి శిరోమణి" – "మహాకవి" విద్వాన్ శ్రీమాన్ ముదివర్తి కొండమాచార్యులు గారికి సప్రశ్రయ ప్రణామములు.

అభ్యర్థించినంతనే టీకా తాత్పర్యములు వ్రాసి ఈ శతకానికి మరింత శోభకూర్చిన అనుంగుమిత్రులు "పురాణ ప్రవచన సుధాకర" బిరుదాంచితులు నెల్లూరు వి.ఆర్. కళాశాల ఆంధ్రశాఖపూర్వాధ్యక్షులు శ్రీ మోపూరు వేణుగోపాలయ్య గారికి, ప్రూఫులు

దిద్ది వేడుక కూర్చిన సుహృద్వతంసులు, నెల్లూరు. వి.ఆర్. కళాశాల ఆంధ్రశాఖ పూర్వఉపన్యాసకులు శ్రీ కె. వెంకటస్వామి రెడ్డి గారికి, డా॥ మైలవరపు శ్రీనివాసరావు గారి అభిప్రాయము నాకు అందుటలో తోడ్పడమే కాక ఎప్పుడెప్పుడీ శతకము ముద్రింపబడుతుందో అంటూ ఉవ్విళ్ళూరుచుండిన సన్మిత్రులు, బంధువు, శ్రేయోభిలాషి "వాత్సల్య–జనహిత" సంస్థ అధ్యక్షులు శ్రీ బసిరెడ్డి శ్రీనివాసులు రెడ్డి గారికి – కృతజ్ఞతా నమస్సుమనస్సులు.

అందంగా అచ్చొత్తించి అందించిన "శక్తి గ్రాఫిక్స్ యాజమాన్యము వారు – శ్రీ బూదూరు గోపాల రెడ్డి గారికి, ముఖ్యంగా ఆ గ్రాఫిక్స్ అధినేత స్నేహశీలి శ్రీ బూదూరు మల్లికార్జున రెడ్డి గారికి, మేనేజరు శ్రీ పి.శివరామ్ గారికి, విసుగు లేకుండా చక్కగా డి.టి.పి. చేసిన చిరంజీవి పొదిలి శివకోటయ్య (శివ) గారికి ఇంకా ఇతరేతర సిబ్బందికి కైమోడ్పులు, శుభాశీస్సులు.

బాల్యచాపల్యముతో వ్రాయబడిన ఈ శతకములో ఇంకను ఏవైన దొసగులున్న వానిని కైకొనక క్షమతో నన్నాశీర్వదించి ఆదరిస్తారని అభిజ్ఞులైన పాఠకమహాశయులకు దీవెనకోలులు.

"ఎవ్వనికెంత బుద్ధి పరమేశుడు తా కృపచేసె అట్టిదై
నివ్వటిలున్ కవిత్వరుచి నేరుపుచాలిన చాలకుండినన్
నవ్వక వర్తమాన కవినాథులు చేకొనరయ్య మత్ కృతిన్
పువ్వులు కందకుండ రసమున్ గొను తేటులవంటి నేర్పునన్'

మహాకవి శ్రీ కనుపర్తి అబ్బయామాత్య కృత, కవిరాజ మనోరంజనము నందలి
ఈ పద్యముతో సెలవు
ఓం తత్సత్
జైహింద్..జయోస్తు

విధేయుడు
**అగస్త్యరెడ్డి వెంకురెడ్డి**

విక్రమసింహపురి,
మాఘశుద్ధ చతుర్దశి
శ్రీ దత్తజయంతి
16–12–2013

'ఉపన్యాస చతురానన'
'సాహితీ వాచస్పతి'
**శ్రీమాన్ మొవ్వ వృషాద్రిపతిగారు**
రేపల్లె, 31-1-2013

# ప్రతిబింబం

ఆత్మాశ్రయ కవిత్వానికి నిలువెత్తు దర్పణం శతకసాహిత్యం. తెలుగు సాహిత్యంలో సగంభాగం ఆక్రమించిన స్వచ్ఛకవితాప్రక్రియ శతకం. శతక రచన నాటికి కవులు సామాన్యంగా ప్రాథమిక దశలో ఉంటారు. శతక సాహిత్యం కేవలం కవుల యొక్క స్వచ్ఛమైన, అమలిన భావ ప్రకటనం. తన యిష్టదైవాన్ని గురించి ప్రార్థనతోనో, తన ప్రేయసి వర్ణనతోనో, తన దేశభక్తి వ్యక్తంచేస్తూనో వెల్లడింపబడేదే శతక సాహిత్యం. ఈ శతకాలు భక్తి శతకాలు-నీతి శతకాలు-ఆధ్యాత్మిక శతకాలు, దేశభక్తి శతకాలు, ఇలా వివిధ శాఖలలో విస్తృతిని పొంది ఉన్నాయి. తెలుగులో మొట్టమొదటి శతకం, పాల్కురికి సోమనాథుడు రచించిన వృషాధిప శతకం, అది భక్తి ప్రపూర్ణం. బసవా! బసవా! బసవా! వృషాధిపా! అనే మకుటంతో ఉద్భవించిన శివభక్తి ప్రబోధకం. దాశరథీ శతకం, కృష్ణశతకం, దేవకీ నందన శతకం, రామభద్ర శతకం, వేణుగోపాల శతకం, ఆంధ్రనాయక శతకం, మొదలైనవన్ని భక్తి శతకాలు. వాని తరువాత ఎన్నదగినవి నీతి శతకాలు. సుమతీశతకం, వేమనశతకం, భాస్కర శతకం, కుమార శతకం, కుమారీశతకం, ఇత్యాదులన్నీ నీతిశతకాలు. యాగంటి శతకం, పశుపతి శతక మిత్యాదులాధ్యాత్మిక శతకాలు.

శతక సాహిత్యంలో ప్రతి పద్యానికీ ఒకే మకుటం ఉంటుంది. కొందరు చిన్న మకుటంతో శతకాలు వ్రాశారు, రాఘవ శతకం, మారుతి శతకం, మొదలైనవి ఆ కోవకు చెందుతాయి. యతిస్థానం నుండి చివరి పాదం పూర్తిగా మకుటంతో కొన్ని శతకాలున్నాయి. కొందఱు కవులు చివఱి పాదమంతా మకుటంగా శతకాలు వ్రాశారు. ఇటువంటి శతక రచన మరీకష్టం. శతక సంఖ్య 100 పద్యాలు గానీ 108 పద్యాలు గానీ ఉంటుంది. చివఱి పాదమంతా మకుటంగా తీసికొంటే మొత్తం పద్యాలలో ఒకే ప్రాసాక్షరం ఉంటుంది. ఆ రచన చాల కష్టసాధ్యం. పైగా శతక పద్యాలన్నీ ముక్తకాలు. ఏ పద్యానికాపద్యమే ఒక కావ్యం. శతకంలో కథ ఉండదు. ప్రతి పద్యంలో ఏదో అర్థ గాంభీర్యమో, చమత్కారమో, అలంకారమో ఉండి పాఠకుని రసతృష్ణను తీర్చగలిగి

ఉండాలి. పద్యంలో జల్లిరచన వస్తే ఆ శతకం నిరాదరణకు గురిఔతుంది. కనుక శతకకవి, ప్రతిపద్య రచనలో ఏదో విధంగా తన ప్రతిభను ప్రతిబింబింపచేయాలి. లేకపోతే పాఠకునకు విసుగు కల్గిస్తుంది. పఠనాసక్తిని తగ్గిస్తుంది.

ఏ మహాకావ్యం వ్రాయకపోయినా కేవలం శతక రచనతో మహాకవి స్థానాన్ని అలంకరించిన కవిశ్రేష్ఠులున్నారు. కాళహస్తిమాహాత్మ్య కావ్యం వ్రాయకపోయినా, కాళహస్తీశ్వర శతకంతోనే ధూర్జటి మహాకవుల పంక్తినలంకరించాడు. కాసుల పురుషోత్తమ కవి ఏ మహాకావ్యం వ్రాయలేదు. "చిత్ర చిత్ర ప్రభావ! దాక్షిణ్యభావ! హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!" అనే మకుటంతో ఆంధ్రనాయకశతకం వ్రాసి మహాకవులలో అగ్రస్థానమలంకరించాడు. ఒకసారి విశ్వనాథ వారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారిని 'గురువు గారూ! పోతన భాగవతానువాదం చేసి ఉండకపోతే ఎవ్వరు చేసేవారు? అని ప్రశ్నించారట. వెంటనే వేంకట శాస్త్రిగారు కాసుల పురుషోత్తమకవి చేసి ఉండేవా"డన్నారట. అంటే ఆయన పోతనతో ఉపమింపదగిన మహాకవిగా పేరెన్నికగన్నాడని భావం. ఆయన హంసలదీవి వేణుగోపాలశతకం మానసబోధ శతకం, భక్తకల్పద్రుమ శతకం వంటి ఉత్తమ సాహిత్య కోటికి చెందిన శతకాలను వెలయించి అజరామరకీర్తిని చూరగొని నాడు. ఈ నాటికీ ఆ పద్యాలు తెలుగు వారి నాల్కలపై నిత్యం తాండవిస్తూనే ఉన్నాయి.

కొందఱు కవులు ఒక మహాకావ్య రచన చేయటానికి సంకల్పించి, తమశక్తి, సామర్థ్యాలను పరీక్షించుకొనటానికీ, తమ ఇష్టదైవకరుణాకటాక్షాలు పొందటానికి ముందు శతక రచన చేశారని విమర్శకులు భావిస్తున్నారు. ఎంత వఱకు సత్యబద్ధమో తెలియదుగాని, భారతరచనకు ముందు తిక్కన మహాకవి కృష్ణ శతకం వ్రాశాడనే ఒక ప్రతీతి లోకంలో ఉన్నది. కాని నిశితంగా పరీక్షిస్తే అది సత్యదూరమనిపిస్తుంది.

శతక రచన ప్రాథమిక రచన అనటంలో ఔచిత్యమేమిటని ప్రశ్నించవచ్చు? తొలిదశలో కవి కేవలం తన హృదయ క్షేత్రంలో చెలరేగిన రసభావాలకు, ఉచిత శబ్ద ప్రయోగంతో కవితా రూపమీయటానికి ప్రయత్నం చేస్తాడు. శ్రవ్య కావ్యరచన నాటికి కవి వ్యక్తావ్యక్త స్వరూపుడు. కొంత కథను స్వయంగా తాను చెబుతూ, కొంత కథను తాను సృష్టించిన పాత్రలతో జరుపుతాడు. ఇక చివటి దశ నాటక రచన. అక్కడ కవి కన్పించడు. అనంత జగత్ప్రజలను సృష్టించి వారివారి కర్మాను సారంగా ప్రవర్తింపుమని వదలివేసిన పరమాత్మవలె దృశ్యకావ్యంలో కవి బయట పడడు. తాను సృష్టించిన

పాత్రలతోనే కథనంతా ప్రదర్శిస్తాడు. అందుకే 'నాటకాంతం సాహిత్యం" అనే ఆలంకారికోక్తి ఉద్భవించింది.

పరిణత కవితాప్రతిభులైన కవులు కూడ శతక రచన చేశారని మనవి చేశాను–వారు స్వల్ప వయస్కులే కావచ్చు. కాని పరిణత ప్రతిభా తపస్వులు. అట్టివారు బాల్యంలో చేసిన రచనలు కూడా మహాకవుల రచనాప్రౌఢిని సంతరించుకొంటాయి. ఇప్పుడు నేను పరిచయం చేయబోతున్న షాణ్మాతుర శతకం ఆ కోవకు చెందిందే. ఏ తత్కర్త శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి. ఈయన రచనలు రాశిలో తక్కువగాని, వాసిలో చాల ఎక్కువ. భగవద్గీతాశ్లోకాలను చక్కని పద్యాలలో రచించి, తెలుగు వారి కామెతలిచ్చినారు. ఈ శతకం చాల చిన్నతనంలో వ్రాయబడినా, మంచి ప్రౌఢిని సంతరించుకొన్నది. ప్రతి పద్యంలోను కవి చేయిదిరిగిన పద్య రచనా సిద్ధ హస్తులుగా గోచరిస్తారు.

"శ్రీ మత్పద్మభవేంద్రముఖ్య సుమనస్సేవ్యాంఘ్రి నాళీక! దు
ష్కామధ్వాంతదివాకరా! శ్రితవిపత్సంహార! యుద్యద్రిపు
స్తోమారణ్య దవానలా! భవరుజాదు:ఖాబ్ధి సంతారకా!
సామంజస్యమెసంగ బ్రోవుము నమస్కారంబు షాణ్మాతురా!"

అనే ప్రథమ పద్యాన్ని పరిశీలించండి. పూర్వ శతకాలలో ఏ శతకరచన కైనా వన్నె తగ్గుతుందేమో వివేచించండి. ఇందులో వాడిన రూపకాలన్నీ సముచిత సుగంధ బంధురాలు. పద్యరచనలో బాగాచేయి తిరిగిన వారు తప్ప సామాన్య కవులు వ్రాయదగిన పద్యంకాదిది. శైలిరమ్యాతిరమ్యం. గట్టులొరసికొని ప్రవహించు ఆకాశమందాకినిలా, విడిచిన రామబాణంలా రచన సాగింది. కవి యొక్క భక్తిభావం ప్రతిపదంలో గుబాళిస్తున్నది. షట్ అనగా ఆరు, ఆరుముఖములు గల వాడు షణ్ముఖుడు. ఆరుగురు తల్లులుగలవాడు షాణ్మాతురుడు. ఆరుగురు కృత్తికలు వచ్చి తమ స్తన్యం త్రావింపబోగా ఆరుముఖములు ధరించి ఏకకాలంలో ఆర్గురు కృత్తికల చనుబాలు త్రావిన కారణంగా ఆయన షాణ్మాతురుడైనాడు. ఆయనే కుమారస్వామి.

తమిళంలో ఈయనను మురుగన్ అంటారు. ఈ మురుగన్ పాదార్చనా సంప్రదాయం నేటికీ తమిళ నాడులో చాల ఎక్కువ. అందుకే చాలమంది ఉదయకాలంలో మురుగా–మురుగా అంటూ దేవస్థానాలకు వెళ్ళటం మనం తమిళ దేశంలో దర్శించవచ్చు.

దేవకార్య ప్రయోజనార్థమై పార్వతీపరమేశ్వరులకు జన్మించి, దేవసేనానియై తారకాసురుని సంహరించాడు. ఈ యనకు శ్రీవల్లికాక, దేవసేన అనే భార్య ఉన్నట్లు చెబుతారు.

మానవునకు ఆంతరంగిక శత్రువులారుగురు. కామక్రోధలోభ మోహమదమాత్సర్యాలనేవే మానవులకు ఆంతరంగిక శత్రువులు. వారే రాక్షసులు ఈ షడ్రిపులకు నాయకుడు కాముడు. కామంచేతనే క్రోధాదీతర శత్రువులు కలుగుతున్నారు. ఈ కాముడే తారకాసురుడు. మిగిలిన క్రోధాదులు రాక్షసులు. మానవునిలోని దైవీ గుణాలు దేవతలు. వారిని అరిషడ్వర్గం బాధిస్తున్నది. ఇవే మానవుని దానవుని చేస్తున్నవి. ఆ దుర్గుణాలను అణచి జీవుని రక్షించేవాడే షణ్ముఖుడు. ఈ అంతరార్థం శతకంలో ప్రతి పద్యంలోను కవి ధ్వనింపజేశారు.

సమాస రచన భావగాంభీర్యంతో నడిపించిన ఈ కవి అలతి అలతి పదాలతో ఎంత తేటతెనుగుదనం గుబాళింప చేయగలరో ఈపద్యం తిలకించండి.

"నేమంబొప్పగ మిమ్ముగొల్చుటది లేనేలేదా? కాదేని నే
నేమైనన్ మిము తూలనాడితినొ? మిమ్మే దిక్కుగా జూడనో?
ఏమీ? యిట్టి మృషాపరాధినగు నన్నీ దుర్దశాంభోధివీ
చీమధ్యంబున ముంచిచంపెదవయో! చిద్రూప! షాణ్మాతురా!

ఎంత తెలుగు దనం? ఎంత భక్తి భావం?

ప్రతి పద్యం భక్తిభావంతో తొణికిసలాడుతుంటుంది. దైవ పూజకు బంగారు పళ్ళెంలో ఉంచిన సువర్ణ పారిజాత కుసుమాల వలె పద్యాలు తళుకు లీనుతున్నాయి.

కొన్ని పద్యాలు పాఠకునకు దిశానిర్దేశం చేస్తాయి. అద్భుతమైన ఆలోచనా శక్తిని రగిలిస్తాయి.

'చనినారెందరొ చక్రవర్తులు ధరన్ శాసించి గర్వైన వెం
టను గొంపోయిరె? అమ్మహామహులకన్నన్ మిన్నలైనేడు నె
త్తిన శృంగమ్ములు వీరికిన్ మొలిచెనో? దేహంబునిత్యంబొ? ఈ
ధనమే శాశ్వతమో? మరేల ధనికుల్ దర్పింత్రు? షాణ్మాతురా!"

ఈ పద్యంలో ఎంత వైరాగ్యం ప్రదర్శించి ప్రబోధించారో. విజ్ఞులెఱుంగనిది కాదు. మానవజాతిలోని అరిషడ్వర్గాన్ని అణచి వారిని సన్మార్గ గాములను చేయటానికి కవి చేసిన ప్రయత్నం ప్రతి పద్యమూ ఎత్తిచూపుతుంది.

ఈ విధంగా చూపిస్తూపోతే ప్రతి పద్యాన్ని చూపించవలసి వస్తుంది. ప్రజ్ఞ–పాండిత్యం, పెనవేసికొని ప్రతిపద్యంలో దర్శనమిస్తాయి.

ఈ కవి లేఖిని నుండి భవిష్యత్తులో భారతీ కంఠరత్నగ్రైవేయకతుల్య మహాకావ్యాలు వెలువడాలని ఆశించటం అత్యాశకాదు.

నిజానికీశతకానికి ప్రతిబింబమవసరంలేదు. ఆత్మీయమిత్రుని ఆజ్ఞ కాదనలేక సాహసించాను. విజ్ఞులు మన్నింతురు గాక.

**మొవ్వ వృషాద్రిపతి**

'వాచస్పతి', 'శిరోమణి', 'మహామహోపధ్యాయ'
**డా॥ సముద్రాల లక్ష్మణయ్య** గారు, ఎం.ఎ.,
ప్రత్యేకాధికారి–పురాణఇతిహాస ప్రాజెక్టు
అన్నమాచార్య కళామందిరం,
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి, 17–10–2013

# నివేదన

దేవతలు స్తోత్ర ప్రియులు. కవులు ప్రారంభదశలో ఇష్టదైవతాలనుద్దేశించి స్తుతి రూపమైన కృతులు వ్రాయడం కద్దు. భగవదనుగ్రహంతో సంప్రాప్తమైన కవితను భగవంతునికే అంకితం కావించడం పరమోదాత్తమైన పద్ధతి.

దేవతలు నానారూపాలతోనూ, వివిధ నామాలతోనూ, విరాజిల్లుతున్నారు. అయినా "ఏకంసత్విప్రాబహుధావదన్తి" అన్నట్లు ఒకే సత్యతత్త్వం అనేక విధాలుగా పేర్కొనబడుతున్న సత్యాన్ని విస్మరించరాదు.

కుమారస్వామి శివుని కుమారుడు. తారకాసుర సంహారానికై జన్మించిన దేవుడు. షట్కృత్తికలచే పోషింపబడి షాణ్మాతురుడుగా ప్రసిద్ధి వహించినవాడు. తమిళ సారస్వతంలో ఈ దేవునికి చెందిన స్తోత్రసాహిత్యం విస్తారంగా లభిస్తున్నది.

ఆత్మీయమిత్రులు శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి గారు సహజ కవితా సంపన్నులు. బాల్యదశలోనే వీరిలోని కవిత వికాసోన్ముఖమయింది. పలు రచనలు వీరి కలం నుండి వెలువడ్డాయి.

ఉపాస్యదైవమైన బాలసుబ్రహ్మణ్యేశ్వరునిపై 122 పద్యాలు శార్దూలమత్తేభ వృత్తాలతో 'షాణ్మాతురా!" అన్న మకుటంతో రచించి వీరు తమ కవితకు సార్థక్యం కలిగించుకున్నారు.

ఇందలి మొదటి 11 పద్యాలు ప్రౌఢమైన సంస్కృత సంబోధనాంత సమాసాలతో నడిచాయి. తరువాతి పద్యాలలో కార్తికేయుని ప్రభావమే కాక తనకు వ్యాధి రూపంలో ఎదురైన బాధలను గూడా ఆస్వామికి విన్నవించుకొన్నారు. 73వ పద్యం తరువాత ఆ స్వామి తన్ను అనుగ్రహించిన విధానాన్ని వివరించారు. ఈ మధ్యలో కల, దండకం వీరి భక్తికి పరాకాష్ఠ అని చెప్పవచ్చు.

ఇలా ఈ కృతిలో కవిత ఎక్కువభాగం కుమారస్వామి స్తుతిగానే కాక ఆత్మాశ్రయంగా కూడా కొనసాగింది. ఇందలి కవిత్వం అత్యంత రమణీయమనడానికి ఈ క్రింది పద్యాన్ని నిదర్శనంగా చూపవచ్చు.

పరుషాలాపము లుజ్జగించి పరులన్ బాధించుటల్ మాని మీ
వరనామామృత సారమానుచు తగన్ వర్తించుచున్ నిత్యమున్
పరమానందము దు:ఖమున్ సమముగా భావించుచున్ తన్ను దా
నెఱుగం గాంచిన వాడు నిన్ను గను గా దే! దేవ! షాణ్మాతురా! (101)

నెల్లూరు సీమలో కవి శ్రేష్ఠులుగా పేరుగన్న శ్రీ వెంకురెడ్డి గారు తమ చిన్ననాట వ్రాసిన ఒక రమణీయమైన, భగవదర్పితమైన కృతిని ప్రకటించి ఇప్పుడు సహృదయుల నానందింప జేయడం మిక్కిలి అభినందనీయం.

ఈ శతకానికి సంగ్రహంగా టీకా తాత్పర్యాలు వ్రాసి పాఠకులకు సహకరించిన శ్రీ మోపూరు వేణుగోపాలయ్య గారు ప్రశంసార్హులు.

ఇంకా ఏవైనా వీరి రచనలు ఇంతవరకూ నిగూఢంగా ఉంటే అవి కూడా త్వరలో వెలుగులోకి వచ్చి పాఠక మిత్రులను రంజింప జేయాలని ఆశిస్తున్నాను.

ఒక చక్కని కృతిని లోకానికి అందించిన వీరిని మనసారా అభినందిస్తున్నాను.

**సముద్రాల లక్ష్మణయ్య**

'ఆర్షవిద్యాసాగర" – "మధురభారతి"
**శ్రీమాన్ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి** గారు
301, శ్రీ సాయిఎన్‌క్లేవ్, అడవి శేషగిరిరావు వీథి,
లక్ష్మీనగర్, సత్యనారాయణపురం,
విజయవాడ–520011
2-11-2013

# ఆత్మ నివేదనము

ఏ ప్రాణికైనా పరమాప్తుడు పరమాత్ముడే. తనకు ఏ కష్టం కలిగినా మానవుడు పరమాత్మకే నివేదించుకుంటాడు. తన కోరికలన్నీ ఆ స్వామికే విన్నవించు కుంటాడు. తనకూ తన యిష్ట దైవానికీ గల సంబంధాన్ని అన్వేషిస్తూ ఉంటాడు. క్రమంగా అతడే తనకు సర్వస్వమని తెలుసుకుంటాడు. ఈ నాలుగు విధాలైన వారు భక్తులలో నాలుగు తెరగులు. వారినే ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని, అని 'చతుర్విధాభజంతే మాం..." అని గీతాచార్యుడు వివరించాడు. మరో కోణంలో చూస్తే, ఆర్తి, అర్థార్థిత్వం, జిజ్ఞాస, జ్ఞానం అనే నాలుగు అంశాలూ ఒకే భక్తునిలో కనిపించే క్రమపరిణామ దశలు. "నరుడికి నాలుగు దశలు" అంటే ఇవేనేమో. ఈ దశల్లో మొదటిది ఆర్తి, ఇది మిగిలిన మూడు దశలకూ ప్రేరణ కూడా. ఆర్తితో ప్రారంభమైన ఆలోచన, అన్వేషణగా, ఆసక్తిగా పరిణమిస్తూ, చివరకు "ఆత్మ నివేదన"గా వ్యక్తమవుతుంది. "అంతో యింతయొ విద్య" నేర్చిన కవి అయితే తన ఆవేదనను కవితానివేదనగా సమర్పిస్తాడు.

అలా సమర్పించిన ఒక సారస్వతవేత్త హృదయ స్పందనే ఈ 'షాణ్మాతురస్తవం" అనే శతకం.

కవి శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి గారు. నెల్లూరు పట్టణంలో ప్రముఖ సాహితీ వేత్త, సాహితీ పోషకులు. విక్రమసింహపురి ''విద్వత్ సింహపురి''గా వెలుగొందడానికి కారకులైన సజ్జనుల్లో ప్రముఖ వ్యక్తి శ్రీ వెంకురెడ్డి గారు.

నేటికి ఐదున్నర దశాబ్దాల క్రిందట కళాశాల విద్యార్థిగా ఉండగా కలిగిన అనారోగ్యం, ఈ కవిని ఆవేదనకు గురిచేసింది. ఆ ఆవేదన అంతర్మధనానికి,

అప్రయత్నంగా వెలువడిన ఆశు కవితకు దారితీసింది. "షాణ్మాతురా!" అనే మకుటం తనంతట తానుగానే అమరింది. పరవశించిన ఆ హృదయంనుండి పరుగులుతీస్తూ పద్యాలు వెలువడ్డాయి. "త్రిశతి' రూపు దిద్దుకున్నది. ఆనందించిన కవి తన ఆరాధ్య దైవమైన సుబ్రహ్మణ్య దేవునికే నివేదించారు. ఆ దైవం 'త్రిశతి'ని స్వీకరించి, ప్రసాదంగా ఇప్పుడు 'శతకం' అనుగ్రహించాడు.

అలా ఆ శతకాన్ని మిత్రుల ప్రోద్బలంతో మా వెంకురెడ్డి గారు ఇప్పుడు ప్రకటించాలనుకోవడం ఎంతో ఆనందం. దైవానుగ్రహ ఫలంగా తనకు లభించిన కవితను ప్రకటించి, ప్రచురించాలనే 'కీర్తికండూతి' ఏమాత్రములేని వెంకురెడ్డి గారు తన రచనలను శ్రద్ధగా పదిల పరచుకోలేదు. అయినా ఈనాడు ఈ శతకం వెలుగు చూస్తున్నదంటే, సుబ్రహ్మణ్యదేవుని కరుణా కటాక్ష వీక్షణ ప్రసాద ఫలం తప్ప మరేమీ కాదు.

ఇక శతకంలో ప్రవేశిస్తే మొదట చెప్పవలసిన అంశం కవిగారి ఆంతర్యం. ఇష్టదైవం అయిన సుబ్రహ్మణ్యుని గురించి వెంకురెడ్డి గారి భావన. పదకొండు పద్యాల వరకు పరచుకున్న సంబోధనలు ఈ అంశాన్ని సూచిస్తాయి. కవిగారి ఆలోచనలో ఆ స్వామి "దుష్కామధ్వాంత దివాకరుడు", 'శ్రిత విపత్సంహారుడు", "ఉద్యద్రిపుస్తోమారణ్య దవానలుడు", "భవరుజాదు:ఖాబ్ధి సంతారకుడు" ఇదీ అగస్త్యరెడ్డి వారి దర్శనం. వల్లమాలిన కోరికలు మనస్సును చీకటి మయం చేస్తాయి. ఆ చీకటి ఎన్నో విపత్తులను కలిగిస్తుంది. చీకటిని అనువుగా చేసుకుని అంతశ్శత్రువులు విజృంభిస్తారు. భవరోగాలు ప్రబలి, దు:ఖ సాగరంలో ముంచెత్తుతాయి. ఈ అన్ని సమస్యలకూ మూలకారణం 'దుష్కామం'. కామంలో నుంచే క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలూ పుట్టుకొస్తాయి. పరిష్కారం ఏమిటి? షాణ్మాతురునికి భక్తితో చేసే నమస్కారమే. ఈ సంబోధనలను కేవలం యిష్టదైవానికి పర్యాయ పదాలుగా కాక, తన మనస్సు కథను తానే పరిశీలించుకొనే సాధకుడి భావనలుగా చూడగలిగితే, కవి హృదయం తెలుస్తుంది.

కవి దృష్టిలో సుబ్రహ్మణ్యుడు ఎలాంటి వాడు? ఈ శతకంలోని పద్యాల్లో మకుటానికి ముందు కనిపించే "దయాపారీణ", "దీనత్రాణ", "ఆర్తత్రాణ", "చిద్రూప", "ప్రణవశ్రీరూప", 'జగత్కల్యాణ", "భక్తజనపాపచ్ఛేత్ర", "విశ్వాధార",

“విశ్వేశ”, “అనంతా” మొ॥ సంబోధనలు ఆ స్వామి తత్త్వాన్ని వెల్లడిస్తాయి.

భక్తుడు ఏం కోరుకుంటాడు? తన యిష్టదైవానికి సేవ చేయాలని, తన ఆరాధ్యమూర్తిని అర్చించుకోవాలని పరితపిస్తాడు. “త్రిజగత్పూజ్యములైన మీ చరణ నీరేజంబులన్... సేవింతు” (12) నని “మిమ్ము మహా మంత్రజప ప్రసూనముల సంపూజింతు”నని స్వామికి విన్నవించు కవిని చూస్తాం మనం.

తన ఆరాధ్య దైవానికున్న కల్యాణ గుణాలను పదే పదే స్మరించడం భక్తుడికి ఎంతో ప్రీతి పాత్రం. ఆరు ముఖాలతో షట్కృత్తికల స్తన్యపానం చేసిన షణ్ముఖ రూపాన్ని రాక్షస సంహారం చేసే ఆ స్వామి పరాక్రమాన్ని ఆ దేవుని దివ్య సౌందర్యాన్ని మనసా మననం చేసే భక్తుడు 14,15,16 పద్యాల్లో దర్శనమిస్తాడు.

సుబ్రహ్మణ్యుడు అంటేనే జ్ఞాన స్వరూపుడు. కుండలినీ పతి. ఓంకారంలోని అంతరార్థాన్ని బ్రహ్మకు, అగస్త్యమహర్షికి ప్రబోధించిన స్వామి “అనిదంపూర్వ మహత్త్వాన్ని’ (17) నోరారా కొనియాడారు కవి.

మానవులకు పరమానందం కలగాలన్నా, సిరిసంపదలు లభించాలన్నా, అభీష్టాలు సిద్ధించాలన్నా మోక్షం కరతలామలకం కావాలన్నా, “నరులన్ వేడగనేల?” “నిన్నే ప్రార్థిస్తానన్న” కవిగారి ప్రగాఢ విశ్వాసం భక్తులకు మార్గదర్శకం.

చెవులున్నందుకు నీ కథలు వినాలి. కన్నులున్నందుకు నీ దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించాలి (22) అంటూ సర్వేంద్రియ సమర్పణం చేశారు కవి.

సుబ్రహ్మణ్య క్షేత్రాలలో భక్తులకు కొంగు బంగారమై వెలసిన అర్చావతార తత్త్వాన్ని (24) “నన్ వేగ రక్షింపగా నీ కంటెన్ మరిలేరు దక్షులు” (26) అంటూ సంపూర్ణ శరణాగతిని వెల్లడించారు కవి.

ఇక, శతక రచనలో కవిగారి పద్య నిర్మాణ నైపుణ్యాన్ని గురించి ఎంత చెప్పినా తక్కువే. ప్రతి పద్యాన్నీ ఉట్టంకించక తప్పదు.

“అంతో యింతయొ విద్య నిచ్చిన” (33) ఆ స్వామి పట్ల భక్తితో ఆ విద్యను కవితగా మలచి ఆ స్వామికే సమర్పించిన కవి ధన్యులు.

ప్రతి మానవుడికీ అనుకూలతలుకొన్ని, ప్రతికూలతలు కొన్ని ఉంటాయి. జీవితంలో అనుకూలించిన అంశాలకు మురిసిపోవాలో, ప్రతిబంధకాలు చూచి

కుమిలి పోవాలో? తెలియక తికమక పడడం (34) మానవనైజం. సుఖమో, దు:ఖమో, ఏదైనా పరమాత్మ ప్రసాదమే నని, "ఈవే దిక్కు" అని దైవంపై భారముంచిన నమ్మిక గలకవిని ఈ శతకంలో చూస్తాం మనం.

"దాసుని తప్పు దండమున పోవంజేసి...(56)" "పిచ్చుక పయిన్ బ్రహ్మాస్త్రమా?... (60) వంటి జాతీయాలు సందర్భోచితంగా పద్యాల్లో ఒదిగి పోయాయి.

సుబ్రహ్మణ్యుడు "కృకవాకు ధ్వజుడు" ఆ స్వామి జెండాపై గుర్తు కోడి. రాత్రి ముగిసిందని, వేయి వెలుగులతో సూర్యుడు ఉదయిస్తున్నాడని చాటిచెప్పేది కోడి. ఆ 'కొక్కొరొకో'' నాదం ప్రణవానికి సంకేతం. స్వామిని ఆరాధించే వారి హృదయంలో ప్రణవనాదం నినదిస్తుందని, జ్ఞాన సూర్యోదయం అవుతుందని సూచిస్తుంది. 'కృకవాకు ధ్వజం' అనేది సాభిప్రాయ సార్థక సంబోధనం (72).

పరుస వేది సోకగానే యినుము బంగారమైనట్లుగా స్వామిని కీర్తించే ఈ శతకం సాహిత్యమే అవుతుందన్న నమ్మకాన్ని వ్యక్తం చేస్తూ (118) సర్వశుభ సందోహాలనూ' ప్రసాదిస్తుందని (121) ఫల శ్రుతిని కూడా చేర్చారు శ్రీ వెంకురెడ్డి గారు.

ఆరోగ్యాన్ని వేడుతూ శతకం ఆరంభమైనా, "దీని చేకొనుమ, మోక్షంబిమ్మ" అంటూ మోక్షాపేక్షతో మంగళాశాసనం చేశారు కవి.

లౌకికమైన ప్రయోజనాలనుంచి క్రమంగా అలౌకికమైన ఆధ్యాత్మికతత్త్వం వైపుగా సాగే కవితా ప్రస్థానం ఈ శతకంలో గోచరిస్తుంది.

తన కవితా సంపదను ఆవేదనతో ఆత్మ నివేదనగా సమర్పించిన అగస్త్యరెడ్డి వారిని అభినందిస్తూ ఆంధ్ర సారస్వత లోకంలో ఈ శతకం 'అక్షరం' కావాలని ఆకాంక్షిస్తూ, రసజ్ఞ రాజశేఖరులు శ్రీ వెంకురెడ్డి గారికి 'ఐదుపది' చేస్తూ... సెలవు.

**శ్రీమన్నారాయణమూర్తి**

"చారిత్రక నవలా చక్రవర్తి"
**ఆచార్య ముదిగొండ శివప్రసాద్** గారు
2-2-647/132 బి, సెంట్రల్ ఎక్సైజ్ కాలనీ,
హైదరాబాద్ - 500 013
ఫోన్ : 040-27425668
12-11-2013

# అభినందనము

శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి గారికి,

నమస్సుమనస్సులు

మీ షాణ్మాతుర శతకం చదివాను. చాలా ప్రామాణికంగా ఉంది. ఏ ప్రబంధకవియో రచించినట్లున్నది. కొన్ని పద్యాలు సూటిగా సామాజిక క్షాళనకు నిర్దేశింపబడ్డాయి. మీపేరు ప్రకటించకుండా ఉంటే ఏ పూర్వకవియో రచించినట్లున్నదని నా భావన. మీ పద్య విద్యకు వందనం-అభివందనం.

**ముదిగొండ శివప్రసాద్**

"రామాయణ ప్రవచన సుధాకర"
"రామాయణ సుధానిధి"
**డా॥ మైలవరపు శ్రీనివాసరావు** గారు
హైదరాబాద్.
16-11-2013

# శాణానుల్లీఢ మణీ! వేంకురెడ్డీ! జయోస్తు!

'శక్తిర్నిపుణతాలోక శాస్త్ర కావ్యాద్యవేక్షణా' త్తని యే మమ్మటుడానాడు కావ్యప్రకాశమందు వచించెనో దానిలోని శక్తి-దేవతానుగ్రహసంపాద్యము, జన్మత స్సిద్ధమునని ద్వివిధమనెనో వాన రెండవది మీకు సొంతమని వక్కాణింపక తప్ప దేమన నొక 'ఎమ్మే ఎకనామిక్సు' వాని కీ యోజోబంధురము, శైలీ శుద్ధిమంతము, ప్రసిద్ధ ప్రస్థాన క్షుణ్ణ మార్గకవితా సంవిధానము సాధ్యమా? ఇది ముఖస్తుతి కాదు - షాణ్మాతురుని సాన్నిధ్యమున నిలిచి మీ పరోక్షమున బల్కుచున్న నెన్నుడి మాత్రమే.

ఉపాసకులెవ్వరేని జోలికిబో భీతి నందించెడివి నారసింహ సుబ్రహ్మణ్యములే. వాన షాణ్మాతురుడు మీ కాదరణీయోపాస్య దైవమన్నంతనే లౌకిక వ్యాధి యుండనగునేమో కర్మక్షయార్థమై-తప్ప నా యాధియే మాత్రముండవీలు లేదు - వలను కాదు.

వ్యాధి యున్నదున్నదను నాధి మీకెక్కువ - ధారణ లేదేమో యను విషయమున ధారణ మెండు. ధారణ లేదనుచునే పన్నెండు పద్దెములను నడ్డాపుదలలులేక చెప్ప, విన్న నాకే మనవలయనో తోచదాయె! చిగురు గొమ్మ ప్రాయముననే కవితనల్లిన మీరు మీ కవితా కేదారమునెందులకు బీడుపొలము జేసితిరా? యని యొక విచారము నాకు.

విశ్వవిద్యాలయాచార్యపదవీ భ్రాజమానులగు నెందరో నిఘంట్వన పేక్షకులగుచు నీ పొత్తము నా చూడమూల మవగత మొనరించు కొనలేరని నా వక్కణ.

మతిలో నమ్మితి (మదిలో నని కాదు) నను ప్రాసగత ప్రయోగము, అఋవది రెండవ పద్యమందలి భావము (ఊతికి మ్రొక్కితి) జంకుజతాలు, వంటివి చక్కగ నున్నవి.

ముక్తక రీతిలో నే పద్యమున కాపద్యము సుందరభావ గర్భితమై సర్వజాతి పుష్ప సంగుంఫిత మాలాయమానమన్పించినది మీ స్తవము. మీరు తెర దొలగించుకొని యీవలకు వచ్చియున్న శాణీల్లీఢమాణులై యుండెడివారలయ్యుండెడిరని నేనును నా యాప్తమిత్రము శ్రీ బసిరెడ్డి శ్రీనివాసులు రెడ్డి యెప్పుడు వచించుకొందుము. తిక్కనపై మీ వ్రాతనభినందింపుచు ఆనాటి యుషశ్రీ గారు మిమ్ముల బరిష్వంగించిరనగా సామాన్య సంమానమౌనా?

మీ పద్దెములలో సర్వసంబోధన సంస్నిగ్ధములలో, (సంఖ్య 5 నుండి యటులే 70 నుండి ) పోతన తొంగి చూచుచున్నాడు.

మీ తలిదండ్రులు ధన్యులు. మీ దాగిన సరస్వతి ప్రశ్లాఘ్య. మీ స్నేహము నిత్యాహ్వాన్య. ఏవమస్తు సర్వదా!

**మైలవరపు శ్రీనివాసరావు**

"కవిశేఖర" – "విద్వత్కవి శిరోమణి" – "మహాకవి"
విద్వాన్ శ్రీమాన్ **ముదివర్తి కొండమాచార్యులు** గారు
కన్సల్‌టెంటు, ప్రధాన సంపాదక కార్యాలయము
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి, 19-11-2013

# గీతమాలిక

కవివరేణ్యుండు జ్ఞానవిజ్ఞానధనుడు
బుధజనవిధేయుడనుపమ పుణ్యయశుడు
సింహపత్తన పూరుషశ్రేష్ఠతముడు
మామకప్రాణమిత్రుండు మంజువక్త
కపటవిరహిత చిత్తు డగస్త్యరెడ్డి
వెంకురెడ్డి రచించిన విమలబోధ
పూర్ణ 'షాణ్మాతుర' స్తవమ్మును పఠించి
హర్షజలనిధిలో ఓలలాడినాడ
పిన్నతనమున ఈతండు పృథుల జటిల
సంస్కృతసమాస ఘటితముల్, సరస మృదుల
ఫణితి తులకించు కమ్మని తెనుగు నుడుల
కూర్పు గల్గిన శార్దూల కుంజరాఖ్య
పద్దియమ్ములజెప్పెడు పటిమ కెల్ల
కొలమువేల్పు సుబ్రహ్మణ్య కొదవలేని
విమలకారుణ్య దృక్ప్సార విలసనమ్మె
కారణమ్ముగ నెంతు, నే కాంచినాడ
మును కుమారుకటాక్ష వీక్షణ ఫలమ్ము
తన్మహిమ నుగ్గడింపంగ తరముగాదు
ఆయురారోగ్య విత్తవిద్యాప్రదమ్ము
సకల సౌభాగ్యమూలమ్ము శక్తిధరుని
శతకము రచించి పాఠకసమితి హస్త
కమలములయందు నుంచిన కట్టనుంగు
చెలికి శ్రీ వెంకురెడ్డికి శ్రీనివాసు
డెల్లసౌఖ్యమ్ముల నొసంగి యేలుగాక!
శుభం భూయాత్

**ముదివర్తి కొండమాచార్యులు**

# సంప్రార్థనము

శ్రీ లక్ష్మీనరసింహుడు
వాలాయము ప్రేమ నెపుడు వరకవి పూడిన్
బాలించు దేవదేవుం
డేలుంగావుతను మమ్ము కృతకృత్యులుగన్.

టీక॥ వాలాయము=ఎల్లప్పుడు, కృతకృత్యులు=ధన్యులు

తా॥ వరకవిపూడిలో వెలసియున్న శ్రీలక్ష్మీ నృసింహదేవుడు ఎల్లవేళల మమ్ము కాపాడుచు ధన్యుల నొనర్చుగాక

**అంబుజబాంధవబింబంబుడంబు వి**
**డంబించు మణికిరీటంబుతోడ**
**కరుణారసంబును గురియు కర్ణాంతదీ**
**ర్ఘములైన లోచనాబ్జములతోడ**
**ప్రకటపాశాంకుశవరదాభయపుముద్ర**
**కొమరారుచున్న హస్తములతోడ**
**పూర్వదేవవ్యూహగర్వభంజన కార**
**కంబైనయట్టి బింకంబుతోడ**
**చెలు వెసంగ విశ్వేశుని చెంతజేరి**
**సిరులకిరవైన వరకవి పురవరమున**
**లీల దళ్మాత్త ప్రజల పాలింపుచున్న**
**ఆర్తజన కల్పవల్లి కామాక్షితల్లి**
**మించు కృప మమ్ము సతము రక్షించుగాత.**

టీక॥ అంబుజబాంధవబింబము=సూర్యబింబము, డంబు=అందము, విడంబించు=పోలు, పూర్వదేవ=రాక్షసులయొక్క, బింకము=గర్వము, ఇరవు=స్థానము, కల్పవల్లి=కల్పలత

తా॥ సూర్యకాంతిని మించు కిరీటముతోను, దయతోకూడిన కన్నులతోను, పాశమును, అంకుశమును, వరదాభయముద్రలను కూడిన చేతులతోడను విశ్వేశ్వరుని సన్నిధిలో వరకవిపూడిలో కొలువైయున్న కామాక్షీమాత మమ్ము కాపాడుచుండుగాక.

**ఎలమి నెల్లవార లెవని పూజింతురు**
**తొలుత నంతరాయములు తొలంగ**
**అట్టి గౌరికూర్మిపట్టి గణాధిపు**
**చరణకమలములకు నెఅగువాడ.**

టీక॥ ఎలమి=సంతోషము, కూర్మిపట్టి=గారాలబిడ్డడు,
తా॥ విఘ్నములు తొలగుటకై అందఱు పూజించెడి గౌరీనందనుడైన వినాయకుని పాదపద్మములకు నమస్కరించుచున్నాను.

**వాణి శుకవాణి మత్తబంభరసువేణి**
**హంసకంఖాణి కల్యాణి అజునిరాణి**
**నమ్ర సర్వగీర్వాణి వీణాసుపాణి**
**నిత్యమును నాదు జిహ్వాపై నిలుచుగాత.**

టీక॥ వాణి=సరస్వతీదేవి, శుకవాణి=చిలుక పలుకులు పలుకునది, మత్త బంభరసువేణి=మదించిన తుమ్మెదల వంటి నల్లనైన కేశపాశముకలది. హంస కంఖాణి=హంసను వాహనముగా కలది. నమ్రగీర్వాణి=వినతులగు సర్వదేవతలు గలది. వీణా సుపాణి=వీణను చేతియందుగలది.
తా॥ సరస్వతీదేవి ఎల్లవేళల నానాలుకపై నడయాడుగాక.

**జననీజనకుల గొలిచెద**
**మనమందు ననారతంబు మానితభక్తిన్**
**కనగా వీరిని మించిన**
**ఘనమగు దైవంబు వేఱుగలదా జగతిన్.**

తా॥ భక్తి భావముతో నిరంతరము తల్లిదండ్రుల సేవించెదను. వీరిని మించిన దేవతలు లోకమున లేరుగదా.

**శ్రీమదుదారభవ్యగుణశీల సమున్నతులన్ సుధీజన**
**గ్రామణులన్ యశోవిభవరమ్యుల పూజ్యగృహస్థధర్మవి**
**ద్యామహితాత్ములన్ వరదమాంబను రాఘవరెడ్డి మౌళి మా**
**తామహుల న్నుతించెద వదాన్యుల ధన్యుల సాధుమాన్యులన్.**

టీక॥ సుధీజనగ్రామణులన్= సజ్జనశ్రేష్ఠులను, వదాన్యులు=దానగుణ సంపన్నులు,
తా॥ మాతామహులయిన శ్రీమతి వరదమ్మను, శ్రీ రాఘవరెడ్డిసత్తముని కొనియాడు చున్నాను.

**మహితసుగుణధనుల మత్పితృజ్యేష్ఠుల**
**జ్ఞాననిధుల ధర్మఖనుల వెంకు**
**రెడ్డి సుబ్బరామరెడ్డి సుకృతుల, య**
**శశ్శరీరుల మది సంస్మరింతు.**

టీక॥ పితృజ్యేష్ఠులు=పెదనాన్నలు, ధర్మఖనులు = ధర్మబుద్ధికి గనులు,
తా॥ కీర్తి శేషులయిన మా పెదనాన్నలు వెంకురెడ్డి, సుబ్బరామరెడ్లను స్మరించుచున్నాను. వారు గుణవంతులు, జ్ఞానులు, ధర్మాత్ములు.

**ఆదిలక్ష్మాంబ దివ్యగుణావలంబ**
**పుణ్యచరితు వీరారెడ్డి భూరియశుల**
**దలతు మత్పితామహుల సద్భక్తి నెపుడు**
**దళితజనకల్పకమ్ముల ధన్యతముల.**

దళితజన కల్పకమ్ముల=పేదలపాలి కల్పవృక్షములు,
తా॥ ధన్యజీవులయిన మా నాయనమ్మ ఆదిలక్ష్మమ్మకు, మా తాత వీరారెడ్డికి భక్తితో నమస్కరించుచున్నాను.

**పిన్నట నాటనుండి నను ప్రేమదలిర్పగ చెంతజేర్చి యె**
**న్నెన్నొ విధాల భారము వహింపుచు నాదుడుకుల్ సహింపుచున్**
**కన్న కుమారు కంటె కనికారము మీరగ పెంచినట్టి మా**
**మన్నుతియింపగా వలదె మాటికి మాటికి మాటిమాటికిన్.**

తా॥ చిన్న తనము నుండి నన్ను దగ్గఅదీసి తన కన్న కుమారుని కంటె ప్రియముగా పెంచిన మా మేనమామ దువ్వూరు పోలారెడ్డి గారిని ఎంతగా ప్రస్తుతిచేసినను చాలదు.

**అంచితమైన ప్రేముడి సమాదరణంబును జేసి నన్ను పో**
**షించుటె కాదు విద్యల నశేష కృపాంచితబుద్ధి నాకు జె**
**ప్పించె, మదీయజన్మ మిటువృద్ధి వహించిన దన్న వారు కా**
**వించు మహోపకారకమె, వేఱెదియేనియు బల్కవచ్చునే?**

తా॥ ప్రేమతో నన్ను పెంచి పెద్ద చేయుటయేగాదు, నన్ను విద్యావంతుని చేసినారు. వారి మహోపకారమే నన్నింతటివానిని చేసినది.

**పూర్వభవనమున నేజేయుపుణ్యమౌర**
**యెట్టిదోగాని, ఫలియించె నేమొ నేటి**
**కీ భవంబున నట్టి యభీష్ట, మిట్టి**
**అభినుతునకు మేనల్లుండనైతి నేను.**

తా॥ అట్టి గుణవంతునికి మేనల్లుడనగుట నాపూర్వజన్మ సుకృతము.

**కారుణ్యంబున జేరదీసి నను లోకజ్ఞానవిద్యాదులం**
**దారూఢాత్మునొనర్చినట్టి సుగుణోద్యద్భాసితున్ మాతులున్**
**సారాచారవిచారధర్మనిరతున్ సౌజన్య దువ్వూరు పో**
**లారెడ్డీంద్రు నుతింతు పుట్టువు కృతార్థత్వముం జెందగన్.**

తా॥ దయతో నన్ను జేరదీసి పెంచిపెద్ద జేసి విద్యావంతుని చేసిన మా మేనమామ శ్రీ దువ్వూరు పోలారెడ్డి గారిని నుతించి నా జన్మ సార్థకము చేసికొనుచున్నాను. ఆయన సౌజన్యమూర్తి గుణవంతుడు ధర్మనిరతుడు.

**వినయమునకు విజ్ఞతకును**
**అనుపమ సుగుణంబులకును ఆలంబనమై**
**తనరిన మా నవనీతాం**
**బ ననుజను దలంతు సాధ్వీమణిని సతంబున్.**

తా॥ వినయవతి, విజ్ఞురాలు, సుగుణవతి అయిన మాతోబుట్టువు నవనీతమ్మను సదా స్మరించుచున్నాను.

**నను సమాదరించెడి వారి కనుదినంబు**
**వందనము సేతు భక్తి భావంబు దనర**
**నను నిరాదరించెడు వారు మనుజు లనుచు**
**కేలు మోడ్తు, వేళ తెగడనేల వారి**

తా॥ నన్నాదరించెడి వారికి భక్తితో నమస్కరింతును. నిరాదరించెడి వారికి కూడ కైమోడ్తును. వారి నిందనాకేల.

# సోదరీస్మృతి

**పద్మబాంధవలుప్తమౌ పగటివోలె**
**శీతకిరణుడులేని నిశీథమటుల**
**అనుగుచెల్లెల, నీవులేనట్టి కతన**
**అంధకార ప్రబంధురంబయ్యె గృహము.**

టీక॥ పద్మబాంధవలుప్తమౌ=సూర్యుడులేని, శీతకిరణుడు=చంద్రుడు, నిశీథము=రాత్రి
తా॥ సోదరీ, సూర్యుడు లేని పగటివలెను, చంద్రుడు లేని రాత్రి వలెను. నీవులేని మన యిల్లు చీకటితో నిండినది.

**కంటికి నిద్రలేదు, సరిగా నొకపూటయు కొంచెమేని ఏ**
**వంటక మింపుగాదు, పనిపాటలపై మది నిల్వదక్కటా,**
**గొంటి కృశించుచుంటి మిట గుండెలు బ్రద్దలు గాగ, తల్లి, నీ**
**వంటి సతీమతల్లి గుణభాసిని యింక భువిన్ జనించునే?**

తా॥ చెల్లీ, కంటికి కునుకురాదు. ఏ వంటకము రుచింపదు. పనులమీద బుద్ధిపోదు. గుండెలు తల్లడిల్ల దు:ఖించుచు కృశించుచున్నాము. నీయట్టి సాధ్వీమణి మఱలపుట్టునా?

**విన్ననువొప్ప నీవు విసువే కనరాక నిరంతరంబు మా**
**కెన్నొవిధాల సేవల రహించితి, నీదు ఋణంబు తీరదిం**
**కెన్నగ జన్మజన్మములకేని రవంతయు, నీదు బుద్ధిసం**
**పన్నత కివ్వె గైకొనుము బాష్పకదుష్ణములౌ నివాళులన్.**

టీక॥ విన్ననువు=నేర్పు, రహించితి=వర్ధిల్లితివి
తా॥ చెల్లెలా, విసుగు విరామము లేకుండ మాకెన్నో విధాల సేవలొనర్చితివి. జన్మజన్మలకు నీ ఋణము తీర్చుకొనలేము. వేడి కన్నీటి నివాళులర్పించుచున్నాము.

**పుట్టుదురు గాక పెక్కురు పురువులట్లు**
**కులముజెఱుపంగ వారల గొడవదేల**
**కులము వెలయించు నీవంటి గుణసుధాబ్ధి**
**చొప్పుచాలదె మణుల కౌస్తుభము వోలె.**

తా॥ వంశము చెడుపుటకై కొందరు చీడపురుగులవలె జన్మింతురు. వారి గొడవమనకెందులకు? కులము నిలుపజాలు నీ వంటి గుణవతి ఒక్కతె చాలదా? నీవు మణులలో కౌస్తుభమణి వంటి దానవు.

**గుణము గలిగిన రూపంబు తనరదెందు**
**రూపు గలిగిన సుగుణముల్ లుప్తములగు**
**గుణము రూపము ప్రతిభయు గూడినట్టి**
**నిన్ను సోదరీ, ఎంతని సన్నుతింతు.**

తా॥ మంచి గుణాలున్న మంచి రూపముండదు. రూపమున్న గుణముండదు. గుణము, రూపము, ప్రజ్ఞగల నిన్ను ఏ రీతిగా పొగడగలను?

**నుతికి నెక్కిన నీ సరి సతులలోన**
**వాసి గాంచితి గుణశీల వర్తనముల**
**సతులకెల్ల నీ చరిత లక్ష్యమ్ముగాగ**
**అట్టి నిన్నింక మఱవంగ నగునె మాకు.**

తా॥ నీ సరి వారయిన సతులలో గుణవతిగా ప్రసిద్ధినందితివి. స్త్రీల కెల్ల నీ చరిత మార్గదర్శమైనది. ఇట్టి నిన్ను మఱవగలమా? తల్లీ.

**మా పాలి భాగ్యదేవత**
**వై పుట్టిన మెట్టినిండ్ల కంచితగతి త**
**ల్లీ! పేరు పెంపు దెచ్చితి**
**వీపుడమిన్ నీకిక తులయెవ్వరు భగినీ!**

తా॥తల్లీ నీవు మా పాలిట దేవతవైతివి. పుట్టినింటికి, మెట్టి నింటికి వన్నెదెచ్చితివి. నీకిక సాటి యెవరు?

# విజ్ఞాపనము

ఒక్క కవీంద్రుడేని కవితోజ్జ్వల తత్త్వమహత్త్వమార్గమీ
ఫక్కి చెలంగునంచు తెలుపంగనులేదు, సుపర్వభాష నొ
క్కక్కరమైనరాదు, తెలుగన్నను నంతకు నంతమాత్ర మే
నెక్కడ? ఈ కవిత్వమది యెక్కడ? ఓ కవిరాజులార, న
క్కెక్కడ, నాకలోకమది యెక్కడ, మీ మతులం గరంపగా
నక్కట, నేర్తునొక్కొ ఇసుమంతయు, నింక మదిష్టదైవ స
మ్యక్కృప నించుమించు పరమాశువుగా విరచించినాడనే
నిక్కృతి, నంతెగాని మఱి యేనును నేటికవీంద్ర కోటిలో
నొక్కడ నై యశోవిభవమొందగ నాశ వహించి కాదు కా
దిక్కడ దాపనేల, వచియించెద నున్నది యున్నరీతి, నా
వాక్కులు సత్యమందురొ లవంబును సత్యము కాదటందురో
ఎక్కరణిన్ దలంచిన సరే యికనేమని పల్కువాడ, నా
యిక్కవితన్ దొసంగులవి యెన్నొ కనంబడు చుండుగాన నిం
దిక్కడ ప్రాస మేగినది, యియ్యెడ నర్థము లుప్తమయ్యెనిం
కక్కడ విశ్రమంబొరిగె, నయ్యెడ భావము సున్నయయ్యె నిం
దెక్కడ శబ్ద సౌష్ఠవ మిదెక్కడి కైతయటంచు మీరు న
న్నెక్కసమాడ నెంచకుడహీనమహామతులార, మ్రొక్కెదన్.

సుపర్వభాష=సంస్కృతభాష, నాకలోకము=స్వర్గలోకము, కవీంద్రకోటి=కవిశ్రేష్ఠుల సమూహము, లవంబును=కొంచెమేని, ఏగినది=తొలగినది, లుప్తము=లోపము, విశ్రమంబు=యతి

తా॥ ఒక్క కవి కూడ కవితామార్గమిది యని నిశ్చయించి చెప్పలేదు. నాకు సంస్కృతము రాదు. తెలుగు కూడ అంతంత మాత్రమే. ఓ కవిరాజులార, మిమ్ము నా కవిత్వముచే సంతసింపజేయగలనా? నేనెక్కడ, ఈ కవిత్వ (శతకము) మెక్కడ, నక్కెక్కడ, నాకలోక మెక్కడ? నాయిష్టదైవము యొక్క కృపచే ఇంచుమించుగా ఆశువులో ఈ శతకము కూర్చినాను. కవి లోకములో స్థానమాశించి కాదు. నా మాటలు నమ్మినను నమ్మకపోయినను నిజముమాత్రమిదియే. నాయీ కవితలో ఎన్నో దొసగులు కానుపింప వచ్చును. ఇదేటి కవిత్వమని నన్ను హేళన చేయవలదు. బుధులారా, మీ కివే నా వందనములు.

శ్రీ విఘ్నేశ్వరాయ నమ:
శ్రీ మత్పరదేవతాయై నమ:
శ్రీ మద్బాలసుబ్రహ్మణ్యాయనమ:

# షాణ్మాతురస్తవము - (శతకము)

**1) శ్రీ మత్పద్మభవేంద్ర ముఖ్యసుమనస్సేవ్యాంఘ్రినాళీక, దు
ష్కామధ్వాంతదివాకరా, శ్రితవిపత్సంహార, యుద్యద్రిపు
స్తోమారణ్యదవానలా, భవరుజాదు:ఖాబ్ధి సంతారకా,
సామంజస్య మెసంగ బ్రోవుము నమస్కారంబు షాణ్మాతురా!**

పద్మభవ=బ్రహ్మ, ముఖ్య=మొదలగు, సుమన:+సేవ+అంఘ్రినాళీక=దేవతల చేత సేవింపదగిన పాదపద్మములు గలవాడ, దుష్కామ= చెడుకోరికలనెడి, ధ్వాంత=చీకటికి, దివాకరా=సూర్యుడా, శ్రిత=ఆశ్రయింబడిన భక్తులయొక్క, విపత్‌సంహార=ఆపదలను దొలగించువాడ, ఉద్యత్=విజృంభించు, రిపుస్తోమ=శత్రు సమూహమనెడి, అరణ్య=అరణ్యమునకు, దవానలా=కార్చిచ్చు వంటివాడా, భవరుజ+దు:ఖ +అబ్ధి=పుట్టుక వలన సంక్రమించిన రోగమనెడి దు:ఖ సముద్రము. సంతారకా=తరింప చేయువాడా, షాణ్మాతురా=కుమారస్వామీ,

తా॥ బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు దేవతలచే సేవ్యమైన పాదపద్మములు గలవాడా, దుష్కామమనెడి చీకటికి సూర్యునివంటివాడా, ఆశ్రితుల విపత్తులను తొలగించువాడా, శత్రు సమూహమనెడి అరణ్యమునకు కార్చిచ్చు వంటివాడా, పుట్టుక వలన సంక్రమించు రోగములనెడి దు:ఖ సముద్రమును తరింపజేయు వాడా, కుమారస్వామీ నమస్కారము. మమ్ము దయతో బ్రోవుము.

**2) జితకందర్పవినూత్నగాత్ర, సర్వబుధరాజీస్తుత్య చారిత్ర దు
ష్కృతసంఘాత లతాలవిత్ర, విలసత్కీర్త్యైక సత్పాత్ర, సం
శ్రిత లోకావన సూత్ర, నిర్జిత సురారిచ్ఛత్ర, షడ్వక్త్ర, సం
తతదుష్టాటవివీతిహోత్ర, రిపుసేనాజైత్ర, షాణ్మాతురా!**

జితకందర్ప వినూత్నగాత్ర = జయింపబడిన మన్మథునియొక్క వినూతన శరీర సౌందర్యము గలవాడ, సర్వబుధరాజీస్తుత్యచారిత్ర=సకలదేవతల చేత కీర్తింపబడు నడవడి కలవాడ, దుష్కృతసంఘాతలతాలవిత్ర= దుర్మార్గుల సమూహమనెడి తీగలను కోసెడి కొడవలివంటివాడ, విలసత్కీర్త్యైక సత్పాత్ర=ప్రకాశించెడి గొప్పయశస్సునకు నిలయమైనవాడ, సంశ్రితలోక+అవనసూత్ర=భక్తజన సమూహమును రక్షించెడి సూత్రధారీ, నిర్జిత సురారిచ్ఛత్ర=జయింపబడిన రాక్షసుని (తారకాసురుని) గొడుగు కలవాడ, షడ్వక్త్ర = ఆఱు మోములు గలవాడ, సంతత దుష్ట+అటవీ వీతిహోత్ర =ఎల్లప్పుడు దుర్మార్గులనెడి అడవికి దావాగ్ని వంటివాడ, రిపుసేనాజైత్ర= శత్రుసేనను జయించినవాడ, షాణ్మాతురా = ఆఱుగురు తల్లులు గలిగిన కుమారస్వామీ.
తా॥ కుమారస్వామీ, నీవు మన్మథుని మించిన అందగాడవు. సర్వదేవతలచే స్తోత్రము చేయబడు నడవడి గలవాడవు. దుష్ట శిక్షణ చేసెడివాడవు. గొప్పయశస్వివి, భక్త జనరక్షకుడవు. తారకాసురుని మర్దించినవాడవు. ఆఱు మోములు గలవాడవు. శత్రు సైన్యమును నిర్మూలించువాడవు.

**3) సురలోకస్తుతనామ, భవ్యసుగుణస్తోమా, స్వకీయాశ్రితో త్కరసంతాపవిరామ, సంతతసుభక్త శ్రేణికాక్షేమ, స త్కరుణాలోకనకౌముదీలసిత, నాకప్రాకటావాస, ని ర్జరహృత్కైరవసార్వభౌమ, రవితేజస్ఫార, షాణ్మాతురా!**

టీక ॥ సురలోకస్తుతనామ = దేవతలచే స్తోత్రము చేయబడుపేరుగలవాడ, భవ్యసుగుణస్తోమ = యోగ్యమైనసద్గుణ సమూహము గలవాడ, స్వకీయ+ఆశ్రిత+ఉ త్కరసంతాపవిరామ = భక్తజనులయొక్క సంతాపమును తొలగించువాడ, సంతతసుభక్తశ్రేణికాక్షేమ = ఎల్లప్పుడు భక్త జనుల శ్రేయస్సును కాంక్షించువాడ, సత్కరుణాలోకన కౌముదీలసితనాక ప్రాకటావాస = దయార్ద్రమైన చూపులనెడి వెన్నెలతో ప్రకాశించువాడ, నాకప్రాకటావాస = స్వర్గమేప్రసిద్ధమైన నివాసముగా కలవాడ, నిర్జరహృత్కైరవసార్వభౌమ =దేవతల హృదయములనెడి కలువల నేలెడి చంద్రుడా, రవితేజస్ఫార =సూర్యుని వంటి తేజస్సుతో అత్యంతాధిక్యముతో వెలుగు లీనెడివాడా.

తా ॥ స్వామీ, షాణ్మాతురా, నీవు దేవతలచే స్తుతిచేయబడు మహాత్ముడవు. సద్గుణ వంతుడవు. భక్తుల బాధలను పోగొట్టు వాడవు. దయార్ద్ర హృదయుడవు. దేవముఖ్యుడవు. దేవతలనేలెడివాడవు. సూర్యసమతేజుడవు.

**4) అలఘుశ్రీకర సుందరాంగ, విపదాహార్యచ్ఛిదాచంగ, దు
ష్కలుషోదగ్రతమ:పతంగ, బుధహృత్కాసార చక్రాంగ,ని
స్తుల కారుణ్యయుతాంతరంగ, బలవద్దోషాచరాటోపదో
హలతా శౌర్యవిభంగ, నిత్యనిజభక్తాపాంగ షాణ్మాతురా!**

టీక ॥ అలఘు శ్రీకరసుందరాంగ = అత్యధికమైన శుభముల నొసగెడి అందమైన శరీరము కలవాడ, విపదాహార్యచ్ఛిదాచంగ = ఆపదలనెడి కొండలను ఛేదించెడి నేర్పరీ,దుష్కలుష+ఉదగ్రతమ:పతంగ = పాపములనెడు పెను చీకట్లకు సూర్యునివంటివాడా, బుధహృత్+కాసార చక్రాంగ=జ్ఞానుల హృదయములనెడి సరోవరములకు హంసవంటివాడా, నిస్తుల కారుణ్యయుత+ అంతరంగ = సాటిలేని దయతోకూడిన హృదయము గలవాడ, బలవత్+దోషాచర+ ఆటోపదోహలతా శౌర్యవిభంగ = బలవంతులయిన రాక్షసుల పరాక్రమమును వినాశము చేసినవాడ, నిత్యనిజభక్త + అపాంగ = నిత్యము భక్తులను దయతో చూచెడివాడ.

తా॥ స్వామీ, నీవు అత్యంత సుందరాకారుడవు. పర్వతాలవంటి ఆపదలను సమూలముగా తొలగింతువు. సూర్యుడు చీకట్లను తొలగించినట్లు భక్తులపాపాలను పోగొట్టెదవు. మానస సరస్సులో హంసలు నడయాడునట్లు జ్ఞానుల హృదయ తలములందు సంచరింతువు. దయాగుణ సంపన్నుడవు. రాక్షస నిర్మూలకుడవు. భక్తజనరక్షకుడవు.

**5) ధృతిజాంబూనదగోత్రతుల్య, సమరక్రీడాధికాగణ్య, సం
తత భక్తావనకార్య, దీనజన సంతాపచ్ఛిదాధుర్య, ని
ర్జిత గర్వాంధసురారివీర్య, విలస జ్జైగీయతాశౌర్య, సం
గతగీర్వాణ సమాజరక్షణ కళాగాంభీర్య, షాణ్మాతురా!**

టీక ॥ ధృతి జాంబూనదగోత్రతుల్య =ధైర్యమునందు మేరుపర్వతముతో సమానుడవైనవాడా, సమరక్రీడాధిక+అగణ్య = యుద్ధక్రీడయందు అగణ్యుడవైనవాడా, సంతతభక్త+అవనకార్య = ఎల్లప్పుడు భక్త సంరక్షణ కార్యనిమగ్నుడా, దీనజన సంతాప+ఛిదాధుర్య = దీనజనుల బాధలను తొలగించు భారము వహించువాడా, నిర్జిత గర్వాంధసురారివీర్య = గర్వముచే కన్ను గానని రాక్షసుల జయించినవాడ, విలసత్ + జేగీయతాశౌర్య = ప్రకాశించునట్టి విజయముతో కూడిన పరాక్రమ శాలీ, సంగత గీర్వాణ సమాజరక్షణ కళాగాంభీర్య = దేవతల సమూహమును రక్షించు కళాగాంభీర్యముతో కూడిన వాడా,

తా॥ మహాత్మా, నీవు మేరునగధీరుడవు. యుద్ధక్రీడలో అగ్రగణ్యుడవు. నిరంతరము భక్తజన తత్పరుడవు. దీనజనుల సంతాపము తొలగించువాడవు. గొప్ప శౌర్యవంతుడవు. భక్తపాలన కళా చతురడవు.

**6) సురసందోహనుతప్రతాప, శమితాస్తోకాఘసంతాప, చి
త్పరమానందమయ స్వరూప, వినమద్భక్తౌఘనిక్షేప, సా
దరవీక్షామధురానులాప, ముని చిత్తాబ్జద్విరేఫా, శుభా
కరసత్కీర్తికలాప, నిర్జిత మహాకౌణాప, షాణ్మాతురా!**

టీక ॥ సురసందోహనుతప్రతాప = దేవతల సమూహముచే స్తుతింపబడు పరాక్రముగలవాడా, శమిత+అస్తోక+అఘసంతాప = ఎడతెగని పాపములను తాపములను తొలగింప జేయువాడా, చిత్పరమానందమయస్వరూప = జ్ఞానానందమయమైన స్వరూపుడా, వినమత్+భక్త+ఓఘనిక్షేప = భక్తుల సమూహమునకు నిక్షేపము వంటివాడ, సాదరవీక్షా మధురానులాప = ఆదరముతో కూడిన చూపులతో మధురసంభాషణచేయు వాడ, మునిచిత్త+అబ్జద్విరేఫా = జ్ఞానులయొక్క చిత్తములనెడి తామరపుష్పములకు తుమ్మెదవంటివాడ, శుభాకర సత్కీర్తి కలాప = శుభములకు నిలయమైన యశస్వీ, నిర్జిత మహాకౌణాప = రాక్షసులను జయించినవాడా.

తా॥ స్వామీ, నిన్ను నిరంతరము దేవతలు స్తుతిచేయుచుందురు. ఎడతెగని పాపములను తాపములను నిర్మూలించెదవు. జ్ఞానానందమయ స్వరూపుడవు. భక్తనిధివి, మధురభాషణుడవు. మునిజనసంతోషకరుడవు. గొప్ప యశస్వివి. రాక్షసాంతకుడవు.

**7) పరమోదారక, భవ్యభారక, జగద్వంద్యాంఘ్రినాళీక, దు
ర్భరదుర్మోహతమోనిరాసక, ప్రభావప్రాభవానల్పకా
అరివిధ్వంసక, సౌఖ్యదాయక, సముద్యద్భక్తమందారకా,
కరుణాధారక, ముక్తికారక, విశాఖా, దేవ, షాణ్మాతురా!**

టీక ॥ పరమోదారక = మహాత్మా, భవ్యభారక = మహత్తరమైనశుభములను వహించువాడ, జగద్వంద్య+అంఘ్రినాళీక = జనులచేత నమస్కరింపదగిన పాదపద్మములు గలవాడ, దుర్భర దుర్మోహతమోనిరాసక = భరింపరాని మూఢత్వమనెడి చీకటిని తొలగించువాడ, ప్రభావప్రాభవ+అనల్పకా = ప్రభావముచే మిక్కిలి అధికమైన ప్రాభవము కలవాడ, అరివిధ్వంసక = శత్రువులను నాశనము చేయువాడ, సౌఖ్యదాయక = సుఖసంతోషముల నొసగెడివాడ, సముద్యద్భక్తమందారకా = భక్తులకు కల్పవృక్షమువంటివాడ, కరుణాధారక = దయామయుడా, ముక్తికారక = మోక్షమునకు కారణభూతుడవైనవాడ, విశాఖ, దేవ

తా॥ మహానుభావ, నీవు శుభమూర్తివి. భక్త జనులు నీ పాదపద్మములను నిరంతరము సేవింతురు. అజ్ఞానము తొలగించి జ్ఞానమునొసగెడి భక్త జనమందారుడవు. మోక్ష ప్రదాతవు

**8) దురితఘ్నాయ, దయాపరాయ, నిగమస్తోత్రాయ, దివ్యాయ, యీ
శ్వరపుత్త్రాయ, ద్విషడ్భుజాయ, త్రిజగద్వంద్యాయ, బాలాయ, దు
స్తరదు:ఖప్రశమాయ, సర్వజగదాధారాయ, తుభ్యంనమ
స్సురసేనాగణ రక్షణాయ, కరుణాశోభాయ, షాణ్మాతురా!**

టీక ॥ దురితఘ్నాయ = పాపవినాశకుడవును, దయాపరాయ = కరుణా పరాయణుడవును, నిగమస్తోత్రాయ = వేదములచే స్తోత్రములందు కొనువాడవును,

దివ్యాయ = మహానుభావుడవును. ఈశ్వరపుత్రాయ = శివుని నందనుడవును, ద్విషడ్భుజాయ = పండ్రెండు చేతులు గలవాడవును, త్రిజగద్వంద్యాయ = ముల్లోకములచే పూజింప బడువాడును, బాలాయ = బాలరూపుడవును, దుస్తరదు:ఖప్రశమాయ = దాటలేని దు:ఖమును కూడా తొలగించువాడవును. సర్వజగదాధారాయ = సర్వలోకములకును ఆదారభూతుడవును, సురసేనాగణరక్షణాయ = దేవతల సైన్యమునకు రక్షకుడవును, కరుణాశోభాయ = దయతో విరాజిల్లు వాడవును అయిన, తుభ్యం = నీకు, నమ:=నమస్కారము.

తా ॥ కుమారస్వామీ, నీవు పాపవినాశకుడవు. దయామూర్తివి. వేదములచే స్తుతులు చేయబడువాడవు. దివ్యుడవు. ద్వాదశభుజుడవు. దు:ఖమును పోగొట్టువాడవు. సర్వలోకములకు ఆధారభూతుడవు. దేవసేనాపతివి. దయతో విరాజిల్లు నీకు నమస్సులు.

**9) విమలోదంచితభవ్యదివ్యగుణసంవేద్య ప్రభాభాసితా,**
**నమదార్తిప్రశమైకచింతన, మహాజ్ఞానస్వరూపాయితా,**
**సుమ బాణాసన కోటి సుందరతనూశోభావిలాసాంచితా,**
**అమరేంద్ర ప్రముఖాభివందితపదాబ్జా, దేవ, షాణ్మాతురా!**

టీక॥ విమలోదంచిత = నిర్మలమై తగియుండు, భవ్యదివ్యగుణ = మహనీయమైన గొప్ప గుణములచేత, సంవేద్య = తెలియదగిన, ప్రభాభాసితా = వెలుగుతో ప్రకాశించు వాడా, నమదార్తి ప్రశమ+ఏకచింతన = నమస్కరించు బాధితులయొక్క బాధలను తొలగింప జేయుటయే ప్రధానముగా చింతించువాడా, మహాజ్ఞాన స్వరూపాయితా = జ్ఞానస్వరూపుడా, సుమబాణా ...విలాసాంచితా = కోటిమంది మన్మధులతో సమానమైన సౌందర్యముగల శరీర శోభా విలాసముతో కూడినవాడా, అమరేంద్ర....పదాబ్జా = దేవేంద్రుడు మొదలగు వారిచే నమస్కృతములైన పాదపద్మములుగలవాడా,

తా॥ దేవ, షాణ్మాతురా, నీవు సద్గుణ విభాసితుడవు. భక్తుల బాధలను పోగొట్టుటకై చింతన చేసెడివాడవు. జ్ఞానమూర్తివి. మహా సౌందర్యముచే ఒప్పువాడవు. దేవేంద్రాదులచే నతులందుకొనెడి వాడవు.

**10) జయగౌరీవరనందనా, జయజగత్సంతాప నిర్మూలనా**
**జయవిద్రోహవిభంజనా, జయ సుభృత్సందోహసంరక్షణా**
**జయరోగార్తివిదారణా, జయసమస్త ప్రాఘ సంహారణా**
**జయవల్లీప్రియ, కావవే అభయహస్తంబిచ్చి షాణ్మాతురా!**

టీక ॥ గౌరీవరనందనా = పార్వతీదేవి పుత్రా, జయ = జయము పొందుము (సర్వోత్కృష్టస్థితి నందుకొనుము) జగత్సంతాప నిర్మూలనా = లోకుల యొక్క బాధలను నాశముచేయువాడా, విద్రోహవిభంజనా = శత్రునిర్మూలకుడా, సుభృత్సందోహసంరక్షణా = సజ్జనులైన భక్తకోటిని రక్షించువాడా, రోగార్తి విదారణా = రోగ బాధలను నిర్మూలించువాడ, సమస్త ప్రాఘసంహారణా = సకల పాపములను నిర్మూలించువాడ, వల్లీప్రియ = వల్లీదేవి మనోహరుడ, అభయహస్తంబు+ఇచ్చి, కావవే = రక్షింపుమా.

తా॥ పార్వతీనందనా, లోకుల సంతాపమును నిర్మూలింతువు. శత్రు నాశకుడవు. భక్తజన రక్షకుడవు. రోగుల రోగాలను తొలగించెడివాడవు. సకల పాపహరుడవు. వల్లీప్రియుడవు. నీకు జయమగుగాక, నాకభయమిచ్చి కాపాడుము.

**11) నిరతానంద, నిరామయా, నిరుపమా, నిర్ద్వంద్వ, నిర్మోహనా,**
**నిరహంకార, నితాంతభూరివిభవా, నిర్వాణసంధాయకా**
**నిరవద్యా, నిగమాత్మ, నిష్కలుష, నిర్నిద్రప్రభావోదయా**
**పరిరక్షింపవె, భక్తవత్సల, దయాపారీణ, షాణ్మాతురా!**

టీక ॥ నిరత+ఆనంద = నిత్యానందస్వరూప, నిరామయా = రోగదూరుడా, నిరుపమా = పోలికలేని వాడా, నిర్ద్వంద్వ = ద్వంద్వములకు (సుఖదు:ఖాది ద్వంద్వములకు) అతీతుడవైనవాడ నిర్మోహనా = మోహము (మౌఢ్యము) లేనివాడ, నిరహంకారా = అహంకారము లేనివాడ, నితాంతభూరివిభవా = నిరంతరముగొప్ప వైభవముతో కూడినవాడ, నిర్వాణసంధాయకా = మోక్షము కలిగించువాడ, నిరవద్యా = నిర్దుష్టుడా, నిగమాత్మ = వేదస్వరూప, నిష్కలుష = పాపరహితుడా, నిర్నిద్రప్రభావోదయా = నిరంతరప్రభావముతో విరాజిల్లువాడ, భక్తవత్సల = భక్తులయందు ప్రీతి కలవాడ, దయాపారీణ = కరుణాస్వరూప, పరిరక్షింపవె.

తా॥ కార్తికేయా, నీవు నిత్యానందుడవు. రోగదూరుడవు. అనుపమానుడవు. ద్వంద్వాతీతుడవు. మోహాతీతుడవు. నిరహంకారుడవు. వైభవోపేతుడవు. మోక్షప్రదాతవు నిరవద్యుడవు. ప్రభుసత్తముడవు, భక్తవత్సలుడవు. కరుణాళుడవు.

**12) త్రిజగత్పూజ్యములైన మీ చరణ నీరేజంబులన్ భక్తిమై**
**భజియింతున్ హృదిలోన నిల్పి, కడు సంభావింతు, సేవింతు, వే**
**వృజినంబుల్ హరియించి సంతతము సంహృష్టాత్ముగావించి, యా**
**త్మజురీతింగని నన్ను బ్రోవుము కృప న్మన్నించి షాణ్మాతురా!**

టీక ॥ త్రిజగత్పూజ్యములైన = ముల్లోకములచే పూజింపదగిన, మీచరణనీరే జంబులన్ = మీపాదపద్మములను, హృదిలో =మనస్సులో నిల్పి, భక్తిమై = భక్తితో, భజయింతున్ = సేవించెదను, కడు = మిక్కిలి, సంభావింతున్ = భావన చేసెదను, సేవింతు, వే = వేగముగా, వృజినంబుల్ = పాపములను, హరియించి, సంతతము = ఎల్లప్పుడు, సంహృష్టాత్ముకావించి =ఆనందముతో కూడిన వానిని గాజేసి, ఆత్మజురీతిన్+కని = కన్నబిడ్డగా జూచి, కృపన్ = దయతో, మన్నించి, నన్ను ప్రోవుము.

తా॥ ముల్లోకములలో పూజ్యములైన నీ పాదపద్మములను సంభావించి సేవించు చున్నాను. వెనువెంటనే నా పాపాలను హరించి నన్ను సంతుష్టుజేయుము. నీపుత్రునిగా నన్ను బ్రోవుము.

**13) ప్రమదంబొప్పగ మీశుభాకృతిని నశ్రాంతంబు హృత్పద్మపీ**
**ఠము నందుంచి సుభక్తి భావన అనుష్ఠానంబు దీపింప మి**
**మ్ము మహామంత్రజపప్రసూనముల సంపూజింతు కైకొమ్ము దే**
**వ! మదోద్రేకవిభంజనా, ననుకృపన్ పాలింపు షాణ్మాతురా!**

టీక॥ ప్రమదంబు+ఒప్పగ = ఆనందముతో, మీశుభాకృతిని = మీశుభాకారమును, హృత్పద్మపీఠము నందు+ఉంచి, అనుష్ఠానంబు దీపింపన్ = నిత్యానుష్ఠానము ప్రకటితమగు చుండగా, మిమ్ము మహామంత్రజప ప్రసూనములన్ = మహామంత్ర జపముతో ఒప్పెడిపూలతో సంపూజింతున్, కైకొమ్ము = స్వీకరింపుము,

తా॥ స్వామీ మీ మంగళకరమైన మూర్తిని నిరంతరము హృదయతలమున నిల్పుకొని భక్తితో మహామంత్రజప ప్రసూనాలతో పూజింతును. నా పూజను స్వీకరింపుము.

**14) తటితో కొండికనాడె కృత్తికల దుగ్ధంబాను నవ్వేళసా**
**దరవీక్షామృత వృష్టిధారలను నత్యంతంబు వర్షింపుచున్**
**భరితోత్సాహత నాఱురూపముల నానందంబు సంధించు మీ**
**చిరు ప్రాయంపుమహత్త్వ సంపదమదిం జింతింతు షాణ్మాతురా!**

టీక॥ తటితో కొండికనాడె = చిన్నతనమునందే, కృత్తికల దుగ్ధంబు+ఆనునవ్వేళ = తా॥ తల్లులైన కృత్తికలయొక్క చనుబాలు త్రాగుసమయమందు, సాదర వీక్షామృతవృష్టిధారలను = దయార్ద్రమైన చూపులనెడి వర్షధారలను, అత్యంతంబు వర్షింపుచున్, భరితోత్సాహతన్ = నిండారిన ఉత్సాహముతో, ఆఱురూపములతో, ఆనందంబు, సంధించు = కలిగించునట్టి, మీ చిరుప్రాయంపు మహత్త్వసంపద = మీ బాల్యము నందలి మహనీయతావైభవమును, మదిన్, చింతింతున్

తా॥ స్వామీ, బాల్యమందు మాతృమూర్తులయిన కృత్తికలస్తన్యము గ్రోలునపుడు అందాలొలికెడు ఆఱుముఖాల వికాససంపదను మదిలో భావించుచున్నాను.

**15) వరదర్పంబున కన్నులంగనకదుర్వారోద్ధతిన్ శౌర్యవి**
**స్ఫురణన్లోకము లెల్ల బెగ్గిలగ సంక్షోభంబు గావించు ఆ**
**సుర విద్వేషణు శూరపద్మున్రుటిలో చూర్ణంబు గావించి సం**
**భరితోత్సాహతబేర్చు మీవిభవమున్ వర్ణింతు షాణ్మాతురా!**

టీక॥ వరదర్పంబునన్ = వరములు పొందుటతో గర్వాతిరేకముతో కన్నులన్+కనక = కన్ను గానక (మూఢుడై), దుర్వార+ఉద్ధతిన్ = అడ్డగింపవీలుగాని పొగరుతో, శౌర్యవిస్ఫురణన్ = పరాక్రమప్రదర్శనచే, లోకములెల్ల బెగ్గిలిగ = లోకములు అన్ని భయపడునట్లుగా, సంక్షోభంబుగావించు = కలతపడునట్లు చేయు, ఆ సురవిద్వేషణుశూరపద్మ = ఆ రాక్షసుడయిన శూరపద్ముని, త్రుటిలో = క్షణములో, చూర్ణంబు కావించి = పొడిచేసి, సంభరిత+ఉత్సాహతపేర్చు = ఉత్సాహముతో అతిశయిల్లు, మీ విభమున్, వర్ణింతున్

తా॥ శూరపద్మడు వరములుపొంది గర్వాతిరేకముతో లోకములన్నిటిని బాధించుచుండగా ఆరాక్షసుని మదమణచి త్రుటిలో చూర్ణము గావించి లోకాల కాపాడిన మీ శౌర్యవైభవము వర్ణనాతీతము.

**16) బళిరే! తావకదివ్యరూపవిభవప్రాకట్య మేలాటిదో**
**తలపంగా భువనైకమోహినులె, దైత్యధ్వంసి నేత్రోద్భవల్**
**లలికందర్ప నిశాంతమార్గణ పరిత్రస్తాంగులైరంట, ఆ**
**చెలువున్ వర్ణనసేతు నాదుమది రంజిల్లంగ షాణ్మాతురా!**

టీక ॥ తావక = నీయొక్క, దివ్యరూపవిభవప్రాకట్యము = గొప్పరూప సౌందర్యవైభవప్రదర్శనము, ఏలాటిదో, బళిరే, తలపంగా = ఆలోచింపగా, దైత్యధ్వంసి = రాక్షస వినాశకుడైన విష్ణుదేవునియొక్క, నేత్ర+ఉద్భవల్ = కంటినుండి (చూపునుండి) పుట్టిన, భువన+ఏకమోహినులె = లోకములలో ముఖ్యముగా పేర్కొనదగిన సుందరీమణులే, లలికందర్ప...ఐరంట = మన్మధ బాణాలకు గురియైరట, ఆచెలువున్ = ఆ సొంపును, వర్ణనసేతు, నాదుమదిరంజిల్లంగ, షాణ్మాతురా.

తా॥ విష్ణుదేవుని కంటి చూపునుండి జన్మించిన భువనైకమోహినులైన సుందరీమణులే నీ సౌందర్యాకృతి చూచి కామవేదనకు గురియైరట. అట్టి నీ సుందరాకృతిని నామనసు రంజిల్లునట్లు వర్ణన చేసెదను.

**17) మునుమృత్యుంజయునానతిన్ మివుల సమ్మోదానుభావుండవై**
**వనజాతాసన కుంభజన్ములకు సువ్యక్తంబుగా గూఢమౌ**
**ప్రణవార్థంబును బోధసేసి కడు సంభావింపవే, అట్టి మీ**
**యనిదంపూర్వమహత్త్వమెన్నగతరంబా నాకు షాణ్మాతురా!**

టీక॥ మును = మునుపు, మృత్యుంజయునానతిన్ = శివుని యాజ్ఞచే, మివుల = మిక్కిలి, సమ్మోదానుభావుండవై = సంతోషించిన వాడవై, వనజాతాసనకుంభజన్ములకు = బ్రహ్మదేవునికి, అగస్త్యమహర్షికి, సువ్యక్తంబుగాన్ = స్పష్టముగా, గూఢమౌ = రహస్యమైన, ప్రణవ+అర్థంబును = ఓంకారస్వరూపమును, బోధచేసి, కడు = మిక్కిలి,

సంభావింపవే = గౌరవించితివి గదా, అట్టిమీ = అటువంటి మీయొక్క, అనిదంపూర్వమహత్త్వము = అపూర్వమైన మహిమాతిశయము నాకు, ఎన్నగతరంబా.

తా॥ మహాత్మా, నీవు మీతండ్రి మహాదేవుని యానతితో బ్రహ్మదేవునికి, అగస్త్యమహర్షికి ఓంకార స్వరూపమును బోధచేసితివి. అట్టి నీ యపూర్వ తత్త్వస్థితిని నే వర్ణింపగలనా?

**18) అమరానీకము మున్ను దానవులతో ఆభీలశౌర్యోన్నతిన్**
**సమరంబొప్పగ జేయువేళ సురసైన్యాధ్యక్షతంబొల్చి, త**
**త్సమరంబందు నిలింపవర్గమునకుత్సాహంబు గల్పించు మీ**
**దు మహత్త్వంబు నుతింప నెవ్వరు సమర్థుల్, దేవ, షాణ్మాతురా!**

టీక॥ అమర+అనీకము = దేవసైన్యము, మున్ను, దానవులతో = రాక్షసులతో, ఆభీల = భయంకరమగు, శౌర్య+ఉన్నతిన్ = పరాక్రమాతిశయముతో, సమరంబు = యుద్ధము, ఒప్పగన్ చేయువేళ = తగినవిధముగా చేయు సమయమున, సురసైన్య+అధ్యక్షతన్ పొల్చి = దేవసేనాధిపత్యము వహించి, తత్సమరంబందు = ఆయుద్ధములో, నిలింపవర్గమునకున్ = దేవతలసైన్యసమూహమునకు, ఉత్సాహంబు+కల్పించు, మీదుమహత్త్వంబు, నుతింపన్ = పొగడుటకు, ఎవ్వరు సమర్థుల్,

తా ॥ మహావీరా, మునుపు దేవసైన్యమునకు అధిపతివై ఆసైన్యమును రాక్షసులతో యుద్ధము చేయువేళ విజయమువైపు నడపిన మీ నాయకత్వమును శౌర్యమును ఎవరు తనివిదీర అభివర్ణింపగలరు?

**19) పరమేష్ఠిప్రముఖుల్ భవన్మహిమమున్ భావింపలేరన్న మీ**
**వరకల్యాణగుణప్రభావవిభవప్రాగల్భ్యమాహాత్మ్యమిం**
**పరయన్ భావనసేసి నాదుమది నెట్లావిష్కరింపంగ దే**
**వర, సద్భక్తజనార్తి దూర, విహితవ్యాపార, షాణ్మాతురా!**

టీక॥ పరమేష్ఠి ప్రముఖుల్ = బ్రహ్మమొదలగు వారు, భవన్మహిమమున్ = మీయొక్క మహత్త్వమును, భావింపలేరు+అన్నన్ = ఊహసేయలేరు అనినచో, మీ = మీ యొక్క,

వర = శ్రేష్ఠమైన, కల్యాణ గుణ ప్రభావ విభవ ప్రాగల్భ్య మాహాత్మ్యము = శుభకరమైన గుణములయొక్క ప్రభావముయొక్క వైభవ ప్రజ్ఞామహత్త్వము, ఇంపరయన్ = ఇంపుగా, భావనసేసి, సద్భక్తజన+ఆర్తిదూర = గొప్ప భక్తులయొక్క బాధలను తొలగించువాడ, విహితవ్యాపార = సత్కార్యకలాపమందే నిమగ్నుడవైనవాడ.

తా॥ స్వామీ, బ్రహ్మమొదలగు దేవముఖ్యులే మీ మహిమాతిశయము భావించి, తెలియజేయ లేరు. మీ అనంత గుణకల్యాణవైభవము నేను వర్ణింపగలనా?

**20) పరమానందము సంఘటించెదరొ, నిర్వాణంబు చేకూర్తురో**
**సిరులీజాలుదురో, అభీష్టఫలముల్ సిద్ధింపగా జేతురో**
**కరుణన్ దు:ఖములెల్లబాపి కడుసౌఖ్యంబిత్తురో, తోచదీ**
**నరులన్ వేడగనేల, ధాత్రిపయి, దీనత్రాణ, షాణ్మాతురా!**

టీక॥ దీనత్రాణ = దీనజనరక్షక, షాణ్మాతురా = కుమారస్వామీ, ధాత్రిపయిన్ = లోకమునందు, నరులన్ = మానవులను, వేడగన్+ఏల = ప్రార్థించుటెందులకు, తోచదు = నాకేమియు తలంపునకు రాదు, పరమానందము సంఘటించెదరొ = పరమానందము కల్గింపగలరా, నిర్వాణంబు = ముక్తిని, చేకూర్తురో = ఈయగలరా, సిరులు = సంపదలు, ఈ జాలుదురొ, అభీష్టఫలముల్ = కోరిన ఫలితములను సిద్ధింపగాజేతురో = సిద్ధింపజేయగలరా, కరుణన్ = దయతో దు:ఖములెల్ల+పాపి = దు:ఖములను పోగొట్టి, కడు సౌఖ్యంబిత్తురో = మిక్కిలి సంతోషమునొసగగలరా.

తా॥ దీనజనరక్షకా, స్వామీ, ఈ నరులు మీవలె పరమానందమును, మోక్షస్థితిని, సంపదలను కోరిన పదార్థములను ఈగలరా. ఇంకను దు:ఖములను పోగొట్టగలరా. అట్టి నరులను వేడుటవలన ప్రయోజనమేమైన కలదా.

**21) తనయుల్ సోదరులాత్మబంధులు కళత్రంబంచు నశ్రాంతమున్**
**ఘనమోహాంబునిధిన్ మునింగి జనముల్ కాలంబు వేగింతుర**
**య్యొ, నిమేషంబును నిన్దలంపరు, యముండుద్దాముడై ప్రాణముల్**
**గొను నవ్వేళ నొకండు సాయపడునే గోరంత షాణ్మాతురా!**

టీక ॥ అశ్రాంతమున్ = ఎల్లప్పుడు, మోహ+అంబునిధిన్ = అజ్ఞానమనెడి సముద్రమందు,

తా॥ కొడుకులని సోదరులని ప్రియబంధువులని భార్యయని ఎల్లప్పుడు మోహజలధిలో మునిగి కాలము గడుపుదురు. త్రుటికాలము కూడా నిన్ను తలపరు. యముడు ప్రాణము తీయువేళ ఒక్కడును సాయపడడు గదా.

**22) వినినన్ నీచరితంబులే వినవలెన్ వేడ్కల్ పిసాళింపగన్**
**కనినన్ నీరుచిరాకృతిన్ కనవలెన్ కాంక్షల్ నిగారింపగాన్**
**మనినన్ నీ పదభక్తిచే మనవలెన్ జన్మంబు భాసింపగా**
**చనినన్ నీ గుడికే చనంగవలె నశ్రాంతంబు షాణ్మాతురా!**

టీక॥ పిసాళింపగన్ = ప్రకాశింపగా, నిగారింపగాన్, భాసింపగాన్ = వెలుగులీనగా, అశ్రాంతము = ఎల్లప్పుడు

తా॥ స్వామీ, వినినచో నీ కథలనే వినవలెను. చూచినచో నీ రూపే చూడవలెను. జీవించినంతకాలము భక్తితో నీ పాదములనే సేవింపవలెను. పోయినచో నీ గుడికే పోవలయును. అప్పుడే మానవుడు నిరతిశయానందము పొందును.

**23) జగతిన్ మానవుడెట్టి దుర్లభమహత్సంశోభితుండైన, ఆ**
**భగవంతుండు కృపాతరంగితమతిన్ భావింపరాకున్న తా**
**నగచాట్లంబడి కోలుపోవు నఖిలం బట్లౌట నేనెప్పుడుం**
**దగ మీ పాదములంటి మ్రొక్కెదను ఆర్తత్రాణ షాణ్మాతురా!**

టీక॥ జగతిన్ = లోకములో, ఎట్టి =ఎటువంటి, దుర్లభ =పొందరాని మహత్+సంశోభితుండైనన్ = గొప్ప తనముతో కూడి ప్రకాశించువాడైనను, ఆ భగవంతుండు, కృపాతరంగితమతిన్ = దయాబుద్ధితో, భావింపరాకున్న = అనుగ్రహింపకున్నచో, తాను, అగచాట్లన్పడి కోలుపోవు, అఖిలంబు, అట్లౌట = కాబట్టి, నేను, ఎప్పుడున్, తగన్, మీ పాదములు, అంటి = తాకి, మ్రొక్కెద, ఆర్తత్రాణ = భక్తరక్షకా, షాణ్మాతురా.

తా॥ ఎంతగొప్ప వాడైనను భగవంతుడు దయచూపకున్నచో కష్టాలపాలైపోవును. సంపదలను సమస్తము కోల్పోవును. కాబట్టి స్వామీ, నేను నీ పాదాలాశ్రయించి మ్రొక్కెదను.

**24) అనఘాత్మా, పళనిన్ తిరుత్తణి మహాహార్యంబుపై బొల్చి సొం**
**పొనరంగోట్ల కొలంది యాశ్రితుల కెంతో కొంగు బంగారమై**
**తనుపొకూరిమి నిష్టకామ్యముల సంధానించు మీమూర్తికిం**
**బ్రణతుల్ గూర్తు సుభక్తి, నిచ్చలును సంరక్షింపు షాణాత్మురా!**

టీక॥ అనఘాత్మా = మహాత్మా, పళనిన్ = పళనిలో, తిరుత్తణిన్ = తిరుత్తణిలో, మహా+అహార్యంబుపైన్+పొల్చి = పెద్ద పర్వతముపై నెలకొని, సొంపు+ఒనరన్ = సొంపొప్పునట్లుగా, కోట్లకొలంది, ఆశ్రితులకున్ = భక్తులకు, ఎంతో, కొంగుబంగారమై = మిక్కిలి అనుకూలుడవై, తనుపొకూరిమిన్ = చల్లని ప్రేమతో, ఇష్టకామ్యములన్ = కోరిన కోర్కులను, సంధానించు = నెరవేర్చు, మీమూర్తికిన్ = మీరూపమునకు, సుభక్తిన్, ప్రణతుల్ కూర్తున్ = నతులు చేయుదును. షాణ్మాతురా, సంరక్షింపుము.

తా॥ పళనిలో తిరుత్తణిలో కొండపై వెలసి భక్తజనుల కోర్కెల తీర్చుచున్నావు. అట్టి మీకు భక్తితో ప్రణమిల్లు చున్నాను. కాపాడుము.

**25) రతిమై అంతిమసంధిమాహ్వాయమహారాజేంద్రులం కృత్తికా**
**వ్రత దీక్షా రుచిరాంతరంగుల కృపన్ పాలింపవే వేగము**
**న్వెతలంబాపి మహాత్మ, అవ్విధిని నానేరంబులన్ సైచి స**
**మ్మతి వీక్షించి సముద్ధరింపుమని సంప్రార్థింతు షాణ్మాతురా!**

టీక॥ మహాత్మా రతిమై = ప్రీతితో, అంతిమసంధిమ+ఆహ్వాయ = అంతిముడు సంధిముడను, మహారాజేంద్రులన్ = మహారాజులను, కృత్తికా వ్రత దీక్షా రుచిరాంతరంగుల = కృత్తికావ్రతదీక్షాపరులను, వేగ = మిక్కిలివేగముగా, మున్ = మునుపు, వెతలన్+పాపి = బాధలను తొలగించి, కృపన్, పాలింపవే, ఆ+విధిన్ =

ఆ విధముగానే, నానేరంబులన్ సైచి, సమ్మతి వీక్షించి = సమ్మతితో చూచి, సముద్ధరింపుము+అని, సంప్రార్థింతున్

తా॥ కృత్తికావ్రత దీక్షాపరులైన సంధిముడు, అంతిముడు అను మహారాజులను వారిబాధలను పోగొట్టి త్వరితగతిని రక్షించినావు కదా. అట్లే నన్నుకూడ కాపాడుము.

**26)** **నాకుంగూర్చెడు దైవమీవయనుచున్ నన్వేగ రక్షింపగా**
**నీకంటెన్ మరిలేరు దక్షులనుచున్ జింతించి, భక్త్యున్నతిన్**
**వాకోబూనితి మీకు నా కథ, దయాస్వాంతుండవైయింకనీ**
**వాకర్ణించి కృతార్థజేయుమనుచున్ ప్రార్థింతు షాణ్మాతురా!**

టీక॥ దక్షులు = సమర్థులు, భక్తి+ఉన్నతిన్ = అతిశయమైన భక్తితో, వాకోబూనితి = చెప్పబూనితిని, దయాస్వాంతుడు =దయతో కూడిన మనస్సుగలవాడు,

తా॥ నాకు ప్రేమాస్పదుడవైన దైవమని, నిన్ను మించి నన్ను రక్షింపగలవారు లేరని నాకథ నీకు చెప్పుచున్నాను. దయతో విని నన్ను ధన్యుని చేయుము.

**27)** **ఆరోగ్యంబది నాటి నాటికిని అత్యంతంబు క్షీణింపగా**
**ఆరంభించుచునున్న ఈ సమయమందన్యాయచేతస్కులౌ**
**వారేరీతిని నిందలన్ సతము నాపైమోపి దుశ్చింత నన్**
**ఘోరంబౌగతి పల్కనేర్తురొ, దయాకూపార, షాణ్మాతురా!**

టీక॥ అన్యాయ చేతస్కులు = న్యాయము విడనాడి ప్రవర్తించు నిర్దయులు, దయాకూపార = దయాసముద్రుడా,
తా॥ నాకు రోజురోజుకు అనారోగ్యము సంప్రాప్తించు ఈ సమయమునందు అధర్మవర్తనులగు దుర్మతులు నాపై నిందలు మోపి నన్ను గూర్చి ఏ విధముగా పలుకుదురో కదా!

**28) అమితోజ్జృంభణ జూపి రోగములు నాకాయాసముంగొల్పు ఈ సమయంబందున మందుమాకులవి విశ్వాస్యంబుగావంచు, ఓ అమరారాధ్య, భవత్పదాబ్జములు డాయన్ వచ్చితిన్, వే, దయా సుముఖత్వంబున జూచి బ్రోవుము ననున్ సొంపార షాణ్మాతురా!**

టీక॥ విశ్వాస్యంబు కావంచు = నమ్మదగినవి కావని, అమర+ఆరాధ్య = దేవతలచే ఆరాధింపదగిన వాడా,

తా॥ రోగములు విజృంభించి నాకు మిక్కిలి బాధను కలిగింపగా ఔషధ సేవనమును నమ్మక నీ పాదములే దిక్కని వచ్చితిని. దయతో నన్ను కాపాడుము.

**29) తెరువొండేదియు కానరాదిక దయాబ్ధీ, యీయెడన్ త్వత్పదాం బురుహోపాసన దివ్యభేషజమె సంపూర్ణంబుగా వ్యాధులన్ హరియింపంగల దంచు నమ్మితిని, లేదావంత సందేహమె క్కరణిన్ దీనుని బ్రోతువో, రుజల నిష్కాసించి షాణ్మాతురా!**

టీక ॥ తెరువు = మార్గము, దయాబ్ధీ = దయాసముద్రుడా, త్వత్పదాంబురుహోపాసన = నీ పాదపద్మముల సేవించుట అనెడి. దివ్యభేషజమె = గొప్పమందే, రుజల = రోగముల, నిష్కాసించి = నిర్మూలించి

తా॥ నాకు వేరుమార్గము లేదు. నీ పాదసేవయే నన్నీ రోగముల బారినుండి రక్షింపగలదని నమ్మితిని. ఆవంతయు ఇందు సందేహములేదు. నన్నెట్లు బ్రోతువో స్వామీ.

**30) వాలాయం బిగురొత్త నొక్కపరిదేవా, నన్కటాక్షించినం జాలుం దేహ మనామయంబగు నిమేషంబందె, నన్నింతకున్ పాలన్ ముంచెదొ, నీటముంచెదవొ, ఆభారంబు నీదేయికన్ పాలింపంగల వాడెవండునను సుబ్రహ్మణ్య, షాణ్మాతురా!**

టీక ॥ వాలాయంబు = అనుకూల్యము, అనామయంబు+అగున్ = రోగములే నిదగును.
తా॥ సుబ్రహ్మణ్యదేవ, ఒక్కపరి దయను నాపై ప్రసరించిన చాలును. నా దేహము ఆరోగ్యవంతమగును. నన్నెట్లు కాచెదవో. నీదే భారము ఇంక నను కాపాడ గలిగిన వాడెవడున్నాడు?

**31) రేపున్ మాపును భక్తిభావమున సుశ్రీస్థానమై యొప్పు మీ
రూపమ్మే మదినిల్పి కొల్చుటయె నాలోపమ్మ కాదేని ఏ
పాపంబే నొనరించినాడ చెపుమా, భక్తార్తిసంహర్త, నా
తాపం బాపగరావిదేమి, దయలేదా, దేవ, షాణ్మాతురా!**

టీక॥ రేపున్ మాపును = ఉదయముననను సాయంసమయముననను (నిత్యము) , సుశ్రీస్థానమై = శుభసంపదలకు నిలయమై, భక్త+ఆర్తిసంహర్త = భక్తులయొక్క బాధలను హరించువాడ
తా॥ సర్వకాలసర్వావస్థలయందు నీరూపమునే మదిలో నిల్పుకొని సేవించుచున్నాను. నేనేపాపము చేయలేదు. నీవు భక్తుల బాధలను తొలగించెడి వాడవు. నా బాధ తొలగింపరానిదా. కరుణించి కాపాడుము.

**32) ఎన్నండేనియు నేరికేని నశుభం బీజన్మమందింతయే
నిన్నే భావనజేసి యేయెఱుగ తండ్రీ, పూర్వజన్మాఘమి
ట్లన్నా, యేపుచునుండె నన్ను నిక ఈ యార్తింబ్రతారింపనీ
కన్నన్ దిక్కెవరయ్య ప్రోవవె, నమస్కారంబు, షాణ్మాతురా!**

టీక॥ ఏరికేనిన్ = ఎవ్వరికికూడ, అశుభంబు ఆలోచనచేసి ఎఱుగన్, పూర్వజన్మ+అఘము = పూర్వజన్మలో చేసిన పాపము, ఏపుచునుండెన్ = బాధించుచున్నది. ఈయార్తిన్ = ఈ బాధను, ప్రతారింపన్ = తొలగించుటకు
తా॥ ఈ జన్మలో నేను ఎప్పుడును ఎవ్వరికిని చెట్ట చేయలేదు. కనీసము తలచికూడ ఎఱుగను. పూర్వజన్మలో చేసిన పాపమిట్లు నన్ను బాధించుచున్నది. నీవే నాయీబాధను పోగొట్ట వలయును.

**33) అంతోయింతయొ విద్య నిచ్చితి సరేయద్దాన రవ్వంత యేన్**
**సంతోసంబది మానసాంబుజమునన్ సంధింపబోవేమి, నా**
**సంతాపంబది మీరెఱుంగనిదియే, సర్వజ్ఞ, చాల్చాలు నీ**
**పంతం బేమిటికయ్య, రమ్ము దయ నన్పాలింప, షాణ్మాతురా!**

తా॥ ఎంతయో కొంత నన్ను విద్యావంతుని జేసితివి. దానివలన నా హృదయ పద్మమునందు ఆనందము కల్గింపరావేమి? నా బాధ మీకు తెలియనిదా, పంతముమాని దయతో నన్ను పాలింపుము.

**34) విద్యాబుద్ధులు గల్గెనాకనుచు సంప్రీతిన్ విజృంభింతునో**
**ఉద్యద్రోగమహార్తిపాలబడి కుయ్యోయంచు వాపోదునో**
**సద్య:కీర్తి ఘటించు కాలమదియున్ సంప్రాప్తమౌనంచునే**
**హృద్యస్ఫూర్తిగ, నూరడిల్లుదునొ, ఈవే దిక్కు షాణ్మాతురా!**

టీక॥ ఉద్యత్+రోగమహార్తి = విజృంభించిన రోగబాధ, వాపోదునో = దు:ఖింతునో, సద్య:కీర్తి = వెనువెంటనే కీర్తిని, ఘటియించు = కలిగించు, హృద్యస్ఫూర్తిగ = మనసార.
తా॥ విద్యావంతుడనైనానని విర్రవీగుదునా, రోగగ్రస్తుడనై కుములుదునా, సత్కీర్తి కలుగుకాలము వచ్చినదని ఓదార్పు పొందుదునా. అన్నిటికి నీవే యేడుగడవు.

**35) ఏదో చిక్కుజనింపజేయుచును నన్నెట్లేని బాధించుటే**
**వాదైపోయెను కాలరాక్షసునకప్పా, యెట్లు సైరింతు, ఈ**
**నాదైన్యమ్మును పారద్రోలి దయవిన్నాణింప రక్షింపు, నీ**
**పాదంబే శరణంచు వేడెద కృపాపాథోధి షాణ్మాతురా!**

టీక॥ దయవిన్నాణింప = దయకలుగగా, కృపాపాదోధి = కృపాసముద్రుడు
తా॥ కాలమనెడి రక్కసునికి ఏదో ఒక విధముగ నన్ను వేధించుటే పంతమైనది. ఎట్లోర్చెదను?. నాయీదీనస్థితి తొలగించి కాపాడుము. దయాసముద్రా! నిన్నే శరణు జొచ్చితిని.

**36) నాయీ ప్రస్తుత దు:స్థితింగనినచో నాతండ్రి, కర్కోటకుం**
**డే యింతైనను జాలిజూపు దయ కానీ మీకటాక్షంబులే**
**దాయెన్నాయెడ, భక్తులన్ మివులగానౌగాములంబెట్ట స్వా**
**మీ, యెవ్వారలు కొల్తు రీధరణిలో మిమ్మింక షాణ్మాతురా!**

టీక ॥ కర్కోటకుండు = దుష్టుడైన నాగు, ఔగాములు = మేలుగీళ్లు
తా॥ స్వామీ, నన్నీ పరిస్థితిలో చూచిన ఎంత దుష్టుడయినను జాలి చూపును. కాని మీకు నాయెడదయలేదు. భక్తులను బాధపెట్టుచున్నచో మిమ్ము ఎవరు కొలిచెదరు

**37) నిన్నుంబోలిన భక్తలోకసులభున్ జింతింపగా లేడటం**
**చున్నిచ్చల్ జనులాడు చుండు పలుకుల్ జూడ న్నిజంబైనచో**
**నన్నెట్లేని సుఖింపజేసి కడు నానందంబు సంధింతువా**
**పన్నానీకశరణ్య, సత్యమిది యే భావింప షాణ్మాతురా!**

టీక॥ నిచ్చలు = నిత్యము, ఆపన్న+అనీక శరణ్య = అనేకులైనదు:ఖితులను రక్షించువాడ, భక్తలోకము = భక్తులసమూహము.
తా॥ ఆపన్న రక్షకా, కుమారస్వామీ, నిన్ను బోలిన ఆర్తజనరక్షకుడు లేడని జనులు పలుకుదురు. అది నిజమైనచో నన్నెట్లయిన కాపాడెదవు. ఇది సత్యము.

**38) కడుకష్టంబుల పాలుసేయుచు నునుం గగ్గోలు గావింపగా**
**దొడరన్ నేనొనరించినట్టి యఘమేదో చెప్పగారాదె, మీ**
**యడుగుల్ గొల్చెడి దానికీ విధిని ప్రాయశ్చిత్తముంజేసినన్**
**పుడమిన్నే బ్రదుకంగ నెట్లగు? దయాంభోరాశి, షాణ్మాతురా!**

టీక॥ అఘము = పాపము, పుడమిన్ = భూమిమీద, దయాంభోరాశి = దయాసముద్రుడ
తా॥ నన్నింత కష్టాలపాలు చేయుటకు నేను చేసిన పావమేమిటి? నిన్నారాధించుచున్నందులకై ఇట్లు నన్ను కారించినచో నేనెట్లు బ్రదికిబట్టగట్టగలను.

**39) అన్యాయ్యమ్ముగ భక్తుడొక్కడిటు దైన్యంబొంది రోదింపుచుం**
**డ న్యాయ్యమ్మటె చూచి చూడనటులుండన్ మీకు, రారమ్మువే**
**ధన్యుంగా నొనరించి ప్రోచి కడు మోదంబిమ్ము, లేకున్నచో**
**మున్యారాధిత, తావకీన చరణంబుల్ వీడ షాణ్మాతురా!**

టీక॥ దైన్యంబు+ఒంది = దీనస్థితినిపొంది, మోదంబు = సంతోషము, ముని+ఆరాధిత = మునులచే పూజింపబడువాడా, తావకీన = మీ యొక్క, చరణంబుల్ = పాదములు

తా॥ మీ భక్తుడు పడరాని పాట్లు పడుచుండగా ఏమరుపాటు వహించుట ధర్మమా? రక్షించి ఆనందపరుని చేయుము. లేకున్నచో మునిసేవితుడవైన నీ చరణములు వదలను.

**40) ధృతి మీకంటెను నన్య దైవతములన్ బ్రేమించి యర్చింప, స**
**మ్మతి మీపైనె లగించి నిత్యమును సమ్యగ్భక్తి భావంబుతో**
**స్తుతియింపందొరకొంటి 'కోర్కి ఫలియించున్నాక'టంచు న్ననుం**
**గృతకృత్యుంబొనరించి ప్రోవగదె, యార్తింబాపి షాణ్మాతురా!**

టీక॥ ధృతిన్ = ధీరబుద్ధితో, లగించి = లగ్నముచేసి, సమ్యగ్భక్తి = సంపూర్ణమైన భక్తి, స్తుతియింపన్దొరకొంటి = స్తోత్రము చేయబూనితిని, కృతకృత్యున్ = ధన్యుని, ఆర్తి = దు:ఖము, పాపి = తొలగించి

తా॥ స్థిరబుద్ధితో నిన్నే ఆరాధించుచున్నాను. ఇతరదైవముల కొలువను. నాకోర్కెఫలింపజేయుదువని నిన్నే నమ్మినాను. నా దు:ఖస్థితిని తొలగించి ధన్యుని జేయుము.

**41) నేమంబొప్పగ మిమ్ము గొల్చుటదిలేనేలేదొ, కాదేని నే**
**నేమైనన్ మిముతూలనాడితినొ, మిమ్మేదిక్కుగా జూడనో,**
**ఏమీయిట్టి మృషాపరాధినగు నన్నీదుర్దశాంభోధి వీ**
**చీమధ్యంబున ముంచి చంపెదవయో, చిద్రూప షాణ్మాతురా!**

టీక॥ నేమంబు = నియమము, మృషాపరాధి = అపరాధముచేయనివాడు, దుర్దశ+అంభోధి = కష్టస్థితి అనెడి సముద్రము, చిద్రూప = జ్ఞానస్వరూప.
తా॥ దేవా, నియమముతో నేను నిన్ను సేవింపలేదా? లేక నేనేమైన నిన్ను నిందించితినా? నీవే నాకు దిక్కని స్థిరముగా నమ్మలేదా? నిరపరాధినైన నన్నేల నీవు కారించుచున్నావు?

**42) ప్రారబ్ధంబును దాట శక్యమగునే యంచాడె దేయేని, మి**
**మ్మేరీతిన్నిజ భక్తపాలకుడవంచెన్నుంజగంబింక, మి**
**మ్మారాధించుచునుంటి నీప్సితము నిమ్మా, నాకు, జాగేల? మీ**
**కారుణ్యామృత వృష్టితన్పదగదే కాసంత షాణ్మాతురా!**

టీక॥ ప్రారబ్ధము = పూర్వజన్మలో చేసిన కర్మఫలము, ఈప్సితము = కోరిక, కారుణ్య+అమృతవృష్టి = దయఅనెడి అమృతము,
తా॥ పూర్వజన్మ కర్మఫలము దాటశక్యము కానిది, అనుభవించియే తీరవలయునని తలచితివేని లోకము నిన్నెట్లు భక్తజనరక్షకుడవని భావించును? నిన్ను త్రిశుద్ధిగ సేవించుచుంటిని. నా కోర్కెతీర్పుము. నీ దయావర్షమునాపై కురిపింపుము. జాగుసేయకుము.

**43) తప్పుల్ సేయని మానవుండు గలడే? ధాత్రీతలంబందు, ఏ**
**తప్పున్ జేసిన గాని మీ పదయుగ ధ్యానంబు గావింప ఆ**
**తప్పున్ సైరణసేసి ప్రోతువని శాస్త్రంబుల్ మహాప్రాజ్ఞులున్**
**జెప్పంగా విని వేడుచుంటి ప్రణవశ్రీరూప, షాణ్మాతురా!**

టీక॥ ధాత్రీతలంబందున్ = భూప్రదేశమునందు, పదయుగము = పాదములజంట, ప్రణవశ్రీరూప = ఓంకారస్వరూప, మహాప్రాజ్ఞులు = గొప్పప్రతిభాసంపన్నులు.
తా॥ ఈ లోకములో తప్పు సేయని మానవుడుండునా? ఏతప్పు చేసినను మీ పాదసేవచేసినచో కాపాడెదవని శాస్త్రములు ఘోషించుచున్నవి. గొప్ప గొప్ప మహనీయు లుద్ఘాటించుచున్నారు.

**44) చదువున్ సామును నేర్చి యూరకిటులన్ సంతోసమేలేకనే**
**నుదగన్ గీమున గోళ్లు గిల్లుకొనుచున్ గూర్చున్నచో బందుగుల్**
**పదుగుర్మెత్తురె? గేలిసేయరె, వృథాబాధంబు సైరింతునే**
**యిదమిత్థంబగు దారి చూపుము దయాబ్ధీ, స్వామి, షాణ్మాతురా!**

టీక॥ గీమునన్ = గృహమందు, ఇదమిత్థంబు = నిజమగు, దయాబ్ధీ = దయాసముద్రుడా

తా॥ విద్యావంతుడనై ఏ పనిసేయక వ్యర్థముగా ఇంటియందే కాలయాపన చేయుచున్నచో బంధువులు మెత్తురా? గేలి సేయరా? దయతో నాకు మంచి దారి చూపుము.

**45) ప్రమదంబొప్ప అరోగుజేసి యెదియోవ్యాజంబునన్ నాకు భ**
**వ్యమయంబైన పథంబు జూపక కడుంబాధింపగా, దేవ, యె**
**ట్లుమన న్నేర్తు? భవత్కృపారసము నెట్లో నాపయిన్నించి, నా**
**శ్రమముంబాపగదయ్య, మీకిదె నమస్కారంబు, షాణ్మాతురా!**

టీక॥ ప్రమదము = ఆనందము, అరోగుజేసి = రోగములేని వానిగా జేసి, వ్యాజము = మిష, మనన్నేర్తు = జీవింపగలను,

తా॥ నన్ను ఆరోగ్యవంతుని జేసి నాకు మంచిదారి చూపకున్నచో నేనెట్లు జీవింపగలను? మీకివే నమస్సులు. దయతో నా బాధ తొలగింపుము.

**46) మనమందుందగ ప్రేమనింపి యనుకంపంజూచినంజాలు, నా**
**తృణమే మేరువుగా నొనర్పగల యోదేవా, జగద్వంద్య, మీ**
**కొనరింపంగ నసాధ్యమున్నె భవదీయోహల్ జగత్సృష్టికిన్**
**చను మూలంబయి నన్ను గాచుటొక హెచ్చా, మీకు షాణ్మాతురా!**

టీక॥ అనుకంపన్ = దయతో, తృణమే = చిన్నగడ్డి పరకయే, మేరువు = మేరుపర్వతము, జగద్వంద్య = లోకములచే నమస్కరింపదగినవాడా, భవదీయ+ఊహల్ = నీతలపులు

తా॥ ప్రేమతో దయజూచినచాలు. దేవా, గడ్డిపరకనే మేరుపర్వతముగా మార్పగల శక్తి మంతుడవు, మహిమాన్వితుడవు. నీ కసాధ్యమనునదిలేదుగదా. నీతలపులే లోకాల సృష్టిమూలము. నన్ను రక్షించుటొక లెక్కా.

**47) ఇరువైయేండ్లై గతింపలేదు మఱి యేమీరోగముల్ ముట్టినన్**
**సురగంజేసెడిరోజురోజునకు, ఈ చోద్యంబు గన్నావె, యిం**
**దురవంతేని దొసంగు నాది కలదే, తోసంబుదీపింప సా**
**దరదృష్టిన్ నను గాంచుటొప్పదె, జగత్కల్యాణ, షాణ్మాతురా!**

టీక॥ సురగన్ చేసెడిన్ = కృశింపజేయుచున్నవి, చోద్యంబు = వింత, తోసంబు దీపింపన్ = ఆనందము కలుగునట్లుగా, సాదరదృష్టిన్ = దయతో కూడినచూపులతో, జగత్కల్యాణ = లోకములకు శుభములొనర్చువాడా.
తా॥ ఇరువదేండ్ల వయసు కూడా దాటలేదు. రోగములు క్రమ్మి దినదినానికి కృశింపజేయుచున్నవి. ఇందు నాదోసమేమైన గలదా? నన్ను దయజూచి రక్షింపుము.

**48) పరగన్దీనులపాలి బంధుడని నిన్వర్ణించు వేదమ్ములా**
**పరతత్త్వంబగు నిన్ను నమ్మి మొదలన్ ప్రార్థింప నింతేనియున్**
**గరగంజాలదు మీమనంబు, శ్రుతి వాక్యంబెన్నగా మోసమా,**
**వరకారుణ్య సముద్ర, భక్తజనపాప చ్ఛేత్ర, షాణ్మాతురా!**

టీక॥ శ్రుతివాక్యము = వేదవాక్యము, వరకారుణ్యసముద్ర = శ్రేష్ఠమైన కరుణాసముద్రుడా, భక్తజనపాపచ్ఛేత్ర =భక్తజనులపాపము పోగొట్టువాడు.
తా॥వేదములు నీవు దీనబంధుడవని కీర్తించుచున్నవి. అట్టి పరంధాముడవైన నిన్ను ప్రార్థింపగా ఇసుమంతైనా నీమనసు కరుగలేదు. వేదవాక్యములసత్యములా? దయామూర్తీ నన్ను కాపాడుము.

**49) క్రోధిత్వంబు వహించి నేడకట నన్ గుందింపగానేల? అ**
**న్యాధారం బిసుమంతయున్న నిటు నిన్నర్థింతునే, దేవ, చిం**
**తాధూతాత్ముడనైన నాకు పరమోత్సాహంబు గల్గించి స**
**మ్మోదంబొప్ప ననుగ్రహింపు రుజలన్ బోకార్చి షాణ్మాతురా**

టీక॥ క్రోధిత్వంబు వహించి = కోపభావము పూని, చింతాధూతాత్ముడనైన = దు:ఖముచే కొట్టబడిన నన్ను, రుజలు = రోగములు

తా॥ స్వామీ, క్రోధమువహించి నన్ను బాధింపనేల? వేఱుదారియున్న ఇట్లునిన్ను వేడుదునా? దు:ఖమగ్నుడనైన నన్ను ఈ రోగములు తొలగించి కాపాడుము.

**50) నాకన్నన్ కలుషాత్ములెందఱొ మిమున్ ధ్యానించి తారీప్సితా**
**నేకార్థంబుల బొంది సౌఖ్యమయ సంతృప్తిన్ వసింపంగ, నన్**
**చీకుంజింతల పాలుసేయుదువె? నిన్సేవింతుదేవా, నమో**
**వాకమ్ముల్, ఘటియింతు నా పయి గృపన్వర్షింపు షాణ్మాతురా!**

టీక॥ కలుషాత్ములు = పాపాత్ములు, తారు = తాము, ఈప్సితానేకార్థంబుల = కోరిన ప్రయోజనము లనేకములను
తా॥ నాకంటె పాపులైనవారు మిమ్ముసేవించి కోర్కెల నీడేర్చుకొని పరమానంద భరితులైయుండగ నన్నిట్లు వంతల పాలుచేసెదవా? నీకు నమోవాకములు. నన్ను దయజూడుము.

**51) నీభక్తుండిటు వేదనాభరమునన్ జింతింపుచున్ వేడ చి**
**త్తాంభోజంబున నిల్పి మీ చరణముల్ ధ్యానింపగా, సత్కృపా**
**లోభం బేటికి? నాదు కోర్కులు కృపాళుత్వంబునన్ దీర్పరా**
**దా, భక్తున్ మఱిగాసి పెట్టదగు నయ్యా తండ్రి, షాణ్మాతురా!**

టీక॥ వేదనాభరమునన్ = దు:ఖభారముతో, చిత్తాంభోజంబునన్ = మన:పద్మమునందు, సత్కృపాలోభంబు = దయావిహీనత్వము, గాసి = బాధ
తా॥ నీ భక్తుడీవిధముగా బాధతో వేడగాను, మనస్సులో తదేకము గా ధ్యానింపగాను దయవీడి సంచరించుట న్యాయమా? దయతో కోర్కెలు దీర్చి బాధలు తొలగింపుము.

**52) ఎఱుగన్నేరకయిచ్చవచ్చినటులెట్లెట్లో దురంతోద్ధతిన్**
**చరియింపన్ దొరకొంటి, ఘోరమగు దుష్కార్యంబులన్ జేసితిన్**
**పొరపాటున్ సయిరించి భక్తుడని సంపూర్ణోరుకారుణ్య భా**
**గ్వరదా, ప్రోవగదయ్య నిచ్చలును దేవా, తండ్రి, షాణ్మాతురా!**

టీక॥ దురంత+ఉద్ధతిన్ = పాపముతో కూడిన పొగరుతో, సంపూర్ణ+ఉరుకారుణ్య భాగ్వరదా = పరిపూర్ణమైన గొప్ప దయతో ప్రకాశించు వరములొసగువాడా, నిచ్చలును = ఎల్లప్పుడు

తా॥ అజ్ఞానినై గర్వముతో ఎన్నెన్నో పాపకార్యము లెట్లెట్లో చేసితిని. నన్ను మన్నించి నీ భక్తుడనని దయతో కాపాడుము. స్వామీ నీవు గొప్ప వరములిచ్చుటలో ప్రసిద్ధుడవు.

**53) శరణన్నన్ మతిచాలు భక్తతతి నిస్తంద్ర ప్రమోదంబునన్**
**పరిరక్షించెడి ఆదిదంపతుల సంతానంబవై విఘ్నసం**
**భరమున్ బాపు గజాస్యసోదరుడవై ప్రఖ్యాతి దీపించుమీ**
**కరయన్ ప్రేముడి లోపమౌనె ప్రభు, విశ్వాధార, షాణ్మాతురా!**

టీక॥ భక్తతతిన్ = భక్తుల సందోహమును, నిస్తంద్రప్రమోదంబునన్ = అలసత్వములేని ఆనందాతిరేకముతో, ఆదిదంపతులు = పార్వతీ పరమేశ్వరులు, గజాస్య = విఘ్నేశ్వరుని, ప్రేముడి = ప్రేమ, విశ్వాధార = లోకాలన్నిటికి ఆధారమైనవాడా,

తా॥ శరణుజొచ్చిన వెంటనే భక్తుల బ్రోచెడి పార్వతీపరమేశ్వరుల బిడ్డడవు. విఘ్నాలంతరింపజేసెడి వినాయకుని సోదరుడవు. అట్టి నీకు భక్తులపై ప్రేమకు లోపమా? వెనువెంటనే తండ్రీ నన్ను కాపాడుము.

**54) గ్రహముల్ చాలవు నాకటంచు నయయో, ప్రఖ్యాతజ్యోతిర్విదుల్**
**గ్రహశాంతింబొనరింపగా వలయు నాలస్యంబు గారాదటం**
**చు హతాశుంబొనరించిరయ్య, యిక నిన్ బూజింతు సద్భక్తి దు**
**ర్గ్రహదౌష్ట్యం బుడిగించి సంతసము కల్గంజేయ, షాణ్మాతురా!**

టీక॥ జ్యోతిర్విదుల్ = జ్యోతిష పండితులు, హతాశున్ = నిరాశాపరుని, పొనరించిరి = కావించిరి, గ్రహదౌష్ట్యంబు = గ్రహములయొక్క దుష్టత్వమును, ఉడిగించి = పోగొట్టి.

తా॥ జ్యోతిషపండితులు నాగ్రహచారము బాగులేదని వెనువెంటనే శాంతులను చేసికొమ్మని నన్ను నిరాశకు గురిచేసిరి. నిన్ను సద్భక్తితో ఆరాధించుచున్నాను. ఈ గ్రహదోష నివారణచేసి నాకు సంతసము కల్గింపుము.

**55) తొలిజన్మంబున జేయుదుష్కృతులు వ్యాధుల్ గాగ మార్పంది బల్**
**సిలుగుల్ గూర్చును ప్రాణికోటికనుటల్ నిక్కంబె, కాదేని ఈ**
**పలురోగంబుల బారి కగ్గమవుదే, పాలింపవే వేగ మీ**
**ఫలితానంద దయావలోకనసుధన్ వర్షించి షాణ్మాతురా!**

టీక॥ దుష్కృతులు = చెడ్డపనులు. సిలుగుల్ = కష్టములు, ప్రాణికోటికి = ప్రాణుల సమూహమునకు, దయావలోకనసుధన్ = దయతో కూడిన చూపులనెడి అమృతమును.
తా॥ పూర్వజన్మమున చేసిన దుష్కర్మలె మరుజన్మలో వ్యాధులై బాధించు నందురు. కానిచో నన్నేల ఇన్ని రోగములావరించినవి. నీ దయామృతమును వర్షించి నన్ను వీని బారినుండి కాపాడుము.

**56) పరమాపాత్ర చరిత్రులౌఘనులతో పాటించి స్నేహంబు నే**
**దురితంబుల్ గొని తెచ్చుకొంటి, నవిపోద్రోలంగ నాకన్యథా**
**తరణోపాయము లేదు. మీ చరణముల్ ధ్యానింతు, రక్షింపుదే**
**వర, ఈ దాసుని తప్పు దండమునబోవంజేసి షాణ్మాతురా!**

టీక॥ పరమ+అపాత్రచరిత్రులు = మిక్కిలి దుర్వర్తనులు, తరణ+ఉపాయము = దాటుమార్గము, దండమున బోవన్ = నమస్కారముతో పోవునట్లు
తా॥ దుర్మార్గులతో స్నేహముచేసి పాపము కొని తెచ్చుకొంటిని. నాకు మీ చరణసేవ తప్ప వేరు దారిలేదు. ఈ దాసుని తప్పును సైరించి కాపాడుము.

**57) ఇలలో వక్రగతింజరించి వెస నెన్నేపాపముల్ చేసియి
ప్డెలమిన్ వీడక నన్ను వీడు బహుధా హింసించుచున్నాడటం
చలుకంబూనకు మయ్య, భూతలమునందాగంగ యెన్నెన్ని వం
కలుగా బారిన దాని నొందు పలుకంగా జన్నె షాణ్మాతురా!**

తా॥ లోకములో ఎన్నో పాపములజేసి యిప్పుడు నన్నీవిధముగా బాధించుచున్నాడని నాపై అలుక వహింపకుము. గంగానది ఎన్ని వంకలుగా ప్రవహించినను పవిత్రమైనదే కదా.

**58) పాపంబుల్ భువినిండిపోయె సుజనప్రాబల్యమా మాసె దు
ర్వ్యాపారాభిరతుల్ ప్రజాప్రభువులై భాసిల్లుచున్నారు, మీ
ప్రాపే యీయెడ నాకు మృగ్యమగుచో రక్షించువారేరి? ఓ
ఆపన్నావన, ప్రోవవే, తడవదేలా, దేవ, షాణ్మాతురా!**

టీక॥ సుజన ప్రాబల్యము = సజ్జనుల ప్రభావము, మాసె = తొలగెను. దుర్వ్యాపారాభిరతుల్ =దుశ్చర్యలయందు ఆసక్తిగలవారు, ప్రాపు = అండ, మృగ్యము+అగుచోన్ = లేకున్నచో, ఆపన్న+అవన = ఆపదలలో నున్న వారిని రక్షించువాడ

తా॥ లోకము పాపభూయిష్ఠమైనది. సజ్జనుల ప్రాబల్యము నశించినది. దుర్మార్గులు ప్రజాప్రభువులైనారు. నీ అండనాకు లేకున్నచో ఈ స్థితిలో నన్ను కాపాడగల వారెవరు? దీనజనరక్షకా, ఆలస్యము చేయక నన్ను కాపాడుము.

**59) శరణన్నన్ కరుణించువాడవను విశ్వాసమ్ము తళ్కొత్తమీ
చరణాబ్జంబుల చెంత జేరితిని, వీ సంబేనియున్నన్నునీ
కరుణాపాంగదృగంచలంబుల కనంగారావు, నాకర్మమో
గురుతేలెదొ, మొఱాలకింపవొ, పరాకో, దేవ, షాణ్మాతురా!**

టీక॥ చరణ+అబ్జములు = తామరల వంటి పాదములు, కరుణ+అపాంగదృక్+ అంచలంబుల = దయతో కూడిన క్రీగంటి చూపులతో, కనంగాన్ రావు = చూచుటకు రాకున్నావు.

తా॥ శరణన్నచో రక్షించువాడవని నీ పాదముల చెంతజేరితిని. రవంత యేనియు కరుణ జూపకున్నావు. నా పూర్వజన్మ దుష్కర్మ ఫలమో? నా మొఱ వినలేదో, పరధ్యానములో నున్నావో? దేవ దయచూడుము.

**60) చెంతం జేరిన వారినిట్లు వెస గాసింబెట్టగా నౌనె? కా**
**సంతైనం గృపచూడ రాగదె మహాత్మా, లోకువౌవారిపై**
**పంతం బేమిటి కయ్య, పిచ్చుక పయిన్ బ్రహ్మాస్త్రమా, దేవ, నా**
**వంతల్ దీర్చి ముదంబు గూర్చి నను సంబాళింపు షాణ్మాతురా!**

టీక॥ గాసిన్ = బాధను, పంతము = పట్టుదల, వంతల్ = దు:ఖములు, సంబాళింపు = ఓదార్పుము

తా॥ దగ్గఱ చేరిన వారినిట్లు బాధింపనగునా? కొంలదిగానైన దయచూడుము. లొంగినవారిపై పంతమేల, పిచ్చుకమీద బ్రహ్మాస్త్రమా? నా బాధలు దీర్చి సంతసము గూర్పుము.

**61) అతినిష్ఠన్ తపమాచరించుటలు, యోగాభ్యాసముల్ చేయుటల్**
**క్రతుకాండంబులొనర్చుటల్ మహిత తీర్థశ్రేణిసేవించుటల్**
**వ్రతముల్ సల్పుటలేనెఱుంగనణుమాత్రంబైన మీ పాదముల్**
**మతిలో నమ్మితి మీరె నాకు గతి సంరక్షింపు షాణ్మాతురా!**

టీక॥ అతినిష్ఠన్ = నిష్ఠాగరిష్ఠతతో, క్రతుకాండంబులు = యోగాలు

తా॥ నియమ నిష్ఠలతో తపమొనరించుట, యోగాభ్యాసము చేయుట, యజ్ఞయాగాదులు చేయుట, వ్రతదీక్షపూనుట నాకు కొంలదిగా నైన తెలియదు. నీపాదములే నమ్మితి నీ వే రక్షకుడవు. నన్ను కాపాడుము.

**62) అకలంకంబగు భక్తిభావమున అభ్యర్చించుచున్ వేడగా**
**అకటా! నాదు మొఱాలకింపవయ, రవ్వంతైన పాషాణమూ**
**ర్తికికైమోడ్పుఘటించునట్టి గతి వ్యర్థీభూతమైపోయె నీ**
**సకలార్తావన కీర్తికిన్ బొడమె దోషంబింత షాణ్మాతురా!**

టీక॥ అకలంకంబగు = కలంకరహితమైన (అచ్ఛమైన) పాషాణమూర్తికి = రాతి బొమ్మకు, కైమోడ్పు = అంజలి (నమస్కారము) వ్యర్థీభూతమైపోయెన్ = నిష్ఫలమైపోయెను. సకల+ఆర్త+అవన = బాధితులనందరిని రక్షించునట్టి, కీర్తికిన్ = యశస్సునకు

తా॥ స్వచ్ఛమైన భక్తిభావముతో నిన్నారాధించు నాప్రార్థన ఆలకింపవైతివి. నాసేవ కేవలము రాతిబొమ్మకు మ్రొక్కినట్లయినది. సకల జనరక్షకుడను నీకు గల కీర్తికి దోషము పొడమినది.

**63) అక్షయ్యంబుగ శీఘ్రశీఘ్రమున నాకారోగ్యసౌభాగ్యపుం**
**భిక్షాదానము చేయ రావెయనుచున్ మిమ్మేను ప్రార్థింప నన్**
**రక్షింపంగను రావిదేమి టయ, యన్యాయంబు, నామీదమీ**
**కక్షం జూపకు తాళలేను, త్రిజగత్కల్యాణ! షాణ్మాతురా!**

టీక॥ అక్షయ్యంబుగ = క్షయముగాని రీతిగ ( శుభకరముగా) త్రిజగత్కల్యాణ = ముల్లోకములకు శుభముకూర్చువాడా.

తా॥ వేగాతివేగముగా నన్ను రక్షింప రావేమియని ప్రార్థింపనీవు రాకుంటివి. ఇది ధర్మముకాదు. నామీద కక్షపూనవద్దు. నేను సహింపలేను

**64) అయయో మీహృదయంబు వజ్ర కఠినంబైయుండెనో, లేకనా**
**కుయినాలింపనెలేదొాయిందనుక భక్తున్నన్ను నీరీతి నెం**
**తయు శోధింపగబూని నాడవొకొా? కానంజాల, నీకన్న నన్**
**దయజూడంగల అన్యదైవము మహాత్మా, లేదు, షాణ్మాతురా!**

టీక॥ కుయి = మొఱ (కూత) శోధింపగబూని = పరీక్షింపదలచి

తా॥ స్వామీ, మీ హృదయము వజ్ర సమానమై నాయెడ కాఠిన్యము వహించినదా? ఇంతవరకు నా మొఱాలింపలేనేలేదా? ఇంకను నన్ను పరీక్షింపదలచితిరా? దేవ నీకన్న నాకు అన్యదైవము లేదు. నీవేదిక్కు.

**65) కడుచాపల్యముతోడ బుద్ధివశముంగాకుండ వేధించెడిన్**
**గడి యొక్కొక్క యుగంబుగా గడచు నిక్కంబింక నిప్పట్టునన్**
**తడవైనన్ సయిరింప జాలుదునె? మత్స్వాంతంబు రంజిల్లగా**
**కడగంటన్ గని కామితార్థచయమున్ గల్పింపు షాణ్మాతురా!**

టీక॥ వేధించెడిన్ = బాధించుచున్నది, తడవైననన్ = ఆలస్యమైనచో, సయిరింపజాలుదునె = ఓర్చుకొనగలనా, మత్స్వాంతంబు = నా అంతరంగము, కామిత+అర్థచయమున్ = కోరిన ప్రయోజనములను

తా॥ నామనస్సు నాకు వశముగాక వేగిరపడుచు బాధనొందుచున్నది. ఒక్కొక్క గడియ ఒక్కొక్క యుగముగా కడచుచున్నది. నాకు మనోరంజకముగా నా కోర్కెల నెల్లనెరవేర్పుము.

**66) స్వామీ, యేల విలంబనంబు సహియింపంజాల రారమ్ము, నీ**
**సామర్థ్యంబిదె చూపగా సమయ మాసన్నంబు, నాయీరుజా**
**స్తోమంబుంబడ గూల్చుటెంత? కరుణా దుగ్ధాంబుధీ, సౌఖ్యల**
**క్ష్మీ మాధుర్యము జూపు మింకనయినన్ జేమోడ్తు షాణ్మాతురా!**

టీక॥ విలంబనంబు = ఆలస్యము, సమయము+ఆసన్నంబు = సమయము సమీపించినది. రుజాస్తోమంబు = రోగాలసమూహము కరుణాదుగ్ధాంబుధీ = దయాక్షీరసాగరుడా,

తా॥ స్వామీ, రక్షించుటకేల ఆలస్యము, రారమ్ము, సమయము సమాసన్నమయినది. దయాసముద్రుడా, నారోగాలను పోకార్చుట నీకెంతపని? నీకు నమస్కరింతును. నన్ను సౌఖ్యవంతుని జేయుము.

**67) అభయందేహియటన్న మాత్రమున నీ వౌదార్యముం జూపి వే**
**అభిమానింతువు భక్త కోటినని అప్పా, చెప్పగా వింటి, నే**
**నభిపన్నుండను 'పాహిపాహి' యని నిన్నర్థింపగా నిట్లు,న**
**న్నభిభూతాత్ము నొనర్ప నీబిరుదు సత్యంబౌనె, షాణ్మాతురా!**

టీక॥ పాహిపాహి = రక్షింపుము, రక్షింపుము, అభిభూతాత్ము = తిరస్కరింప బడువానిగా

తా॥ అభయమిమ్మని ప్రార్థించిన వెంటనే నీవు భక్తులనభిమానింతువని చెప్పగా వింటిని. నీ శరణార్థిని రక్షింపుమని నిన్నిట్లు అర్థింపగా నన్ను నీ అనుగ్రహమునకు పాత్రునిగావింపనిచో శరణాగత రక్షకుడన్న బిరుదు సార్థకమగునా.

**68) ఒక రోగంబది తగ్గుచుండగను వేఱొక్కండు నుద్వేలమై**
**వికలత్వం బొనరించుచుండె నెటులన్ వేగింతు నీకాయమున్**
**సకల స్థావరజంగమాత్మక, ననుంసమ్యక్కృపాదృష్టినీ**
**వికనైనం గనియేలుకోగదవె, ఈ వేదిక్కు షాణ్మాతురా!**

టీక॥ ఉద్వేలమై = అధికమై, సకల స్థావరజంగమాత్మక = సమస్త స్థావరములు (కదలనివి) జంగమములు (చలించునవి) అయిన జీవరాశులు నీవే అయినవాడా, సమ్యక్ కృపాదృష్టిన్ = సంపూర్ణమైన దయాదృష్టితో

తా॥ ఒక రోగము తగ్గుముఖము పట్టగా వేఱొకటి ప్రబలుచున్నది. ఈ శరీరము నెట్లు మననిత్తును. విశ్వరూపా, నీవేదిక్కు. సంపూర్ణమైన దయాదృష్టిని ప్రసరించి నన్నేలు కొనుము.

**69) కట్టా! నిన్ బతిమాలుచున్న కొలదిన్ కష్టాంబుధింద్రోయుచున్**
**బెట్టుం జూపుచునుంటి వైననిక నిన్వీడన్ రవంతేని, నే**
**పట్టుంబట్టితి నిద్ది నీకు తెలియున్ భాషింపగానేల, నన్**
**గట్టెక్కింపుము. పంతమెందుకు దయాకంధీశ, షాణ్మాతురా!**

టీక॥ కష్ట+అంబుధి = కష్టములనెడి సముద్రము, దయాకంధీశ = దయాసముద్రుడా.

తా॥ అయ్యయో, నిన్ను ప్రాధేయపడుచున్నకొలది నన్ను మరిన్ని కష్టాలలో పడవేయుచుంటివి. అయినను నిన్ను వీడను. ఈ విషయము నీకు తెలియును. పంతము పట్టక నన్ను ఈ కష్టాల కడలినుండి గట్టెక్కింపుము.

**70) ఓ కారుణ్య పయోధి, భక్తజన సర్వోపద్రవచ్ఛేద, చి
త్రాకారా, గిరిజాకుమార, పరమాత్మా, కోటి కందర్పమూ
ర్తీ, కల్యాణ గుణాభిరామ, శరణార్థిన్ నన్ను రక్షింప రా
వే, కీర్తిప్రద, వేదవేద్య, విమలా, వేవేగ, షాణ్మాతురా!**

టీక॥ కారుణ్య పయోధి = దయాసముద్రుడా, భక్తజనసర్వ+ఉపద్రవచ్ఛేద = భక్తజనులయొక్క సకల కష్టాలను తొలగించువాడా, చిత్రాకార = వింతయైన ఆకారముకలవాడా, గిరిజాకుమార = పార్వతీ నందనా, కోటికందర్పమూర్తీ = కోటిమంది మన్మధులయొక్క అందమైన శరీరాకృతి కలవాడా, కల్యాణ గుణ+అభిరామ = కల్యాణ గుణములచే మనోహరమైనవాడా, కీర్తిప్రద = యశస్సునొసగు వాడ, వేదవేద్య = వేదములచే తెలియదగిన వాడా, విమలా = నిర్మలుడా

తా॥ స్వామీ, దయాస్వరూప శరణార్థిని నన్ను వేగముగా వచ్చికావుము.

**71) ఈవే తల్లియు తండ్రియున్ గురుడ వీవే దైవమున్ ద్రాతవున్
నీవే భ్రాతవు నేతవున్ మఱియు నీవే ప్రాణ మిత్రుండ వౌ
దీవే ఆపదలందు రక్షకుడ వీవే చుట్టముంబక్కమున్
నీవే తప్ప యితఃపరంబెఱుగ తండ్రీ, రావె, షాణ్మాతురా!**

టీక॥ త్రాతవున్ = రక్షకుడవు, నేతవు = నాయకుడవు. ఇతఃపరంబు+ఎఱుగ = మఱిదేనిని ఎఱుగను

తా॥ స్వామీ, నీవేతల్లివి, తండ్రివి. గురుడవు, నీవేదైవమును, రక్షకుడవును, నీవే సోదరుడవు, నేతవు, ప్రాణమిత్రుడవు కూడా నీవే, ఆపత్కాలమందు రక్షకుడవు నీవే, బందుగుడువు నీవే, నీవు తప్ప నాకు వేఱెవరు లేరు వచ్చి కాపాడుము.

**72) కృకవాకుధ్వజ, కార్తికేయ, గుహ, గాంగేయా, మహాసేన, తా
రకజైత్రా, శరజన్మ, శక్తిధర, హేరంబానుజా, కేకివా
హక, క్రౌంచాచల గర్వభంజక, కుమారా, దేవసేనాహ్వాయా
వికచాంభోరుహలోచనప్రియ, దయన్ వీక్షింపు షాణ్మాతురా!**

టీక॥ కృకవాకుధ్వజ = కోడిపుంజుధ్వజముగాగలవాడ, కార్తికేయ = కృత్తికానందన, గుహ = గుహుడను పేరుగలవాడ, గాంగేయ = గంగానందన, మహాసేన = దేవసేనాధిపతీ, తారకజైత్ర = తారకాసురుని జయించినవాడా, శరజన్మ = తెల్లుగడ్డిలో జన్మనందినవాడా, శక్తిధర = శక్తిఅను ఆయుధమును ధరించినవాడా, హేరంబ+అనుజా = వినాయకుని సోదరా, కేకివాహక = నెమలిని వాహనముగాగలవాడ, క్రౌంచ+అచల గర్వభంజక = క్రౌంచపర్వతముయొక్క గర్వము నణచినవాడ, కుమారా = కుమారస్వామీ, దేవసేనాహ్వాయా = దేవసేన అనుపేరుగల, వికచ+అంభోరుహలోచనప్రియ = వికసించిన తామరల వంటి నేత్రములు గల ఆమెకు ప్రియుడవైనవాడ

**73)** **ఓ దీనావన, ఓదయాజలనిధీ, ఓ చింతితార్థప్రదా**
**ఓ దేవౌఘ సమర్చితాబ్జచరణా, ఓ భక్త కల్పద్రుమా**
**ఓ దుర్దోషమహాంధకారతరణీ, ఓ దేవసేనాపతీ**
**నా దీనత్వము బాపుమా, సుజన సంత్రాణాఖ్య, షాణ్మాతురా!**

టీక॥ దీన+అవన = దీనరక్షకా, దయాజలనిధీ = దయాసముద్రుడా, చింతిత+అర్థప్రదా = కోరిన కోర్కెల నిచ్చువాడ, దేవ+ఓఘ సమర్చిత+అబ్జచరణా = దేవతల సమూహముచే పూజింపబడిన తామరల వంటి చరణములు గలవాడా, భక్త కల్పద్రుమా = భక్తుల పాలిటి కల్పవృక్షమా, దుర్దోషమహాంధకారతరణీ = దోషములనెడి చీకటికి సూర్యుని వంటివాడా, సుజనసంత్రాణ+ఆఖ్యా = సజ్జనరక్షకుడని పిలువబడువాడా

# దండకము

శ్రీ మన్మహాసేన, నిర్వాణ సంధాన, భక్తౌఘసంత్రాణ, కుంభోద్భవాశేష మౌనీశసంఘాత సంస్తూయమానా, సుసౌఖ్య ప్రదానా, మహాగర్వనిర్వాపణా ఖర్వభీమ ప్రభావాభిరామా, జగద్గేయనామా, కృపావార్ధికల్లోల భాస్వత్కటాక్షా, విరాజన్మనోహారిశోణాంబుజాక్షా, ప్రయోగ ప్రదాన ప్రవాహైకదక్షా, నతస్తోమరక్షా, ప్రశస్తానులాపా, నిరస్తోపతాపా, పరబ్రహ్మ రూపా, సమస్తాఘసందోహ సంహార కారా, కుమారా, భవానీ కుమారా, గళోల్లాసిహారా, నమద్భృద్విహారా, సులావణ్యగాత్రా, మహాబర్హిపత్రా, రుజాకాండ నిర్మూలకా, శత్రువిధ్వంసకా, సర్వకామ్యార్థ సంధాయకా, కోటి మార్తాండ సంకాశనీకాశ వల్లీశ, వేదాంతవేద్యా, మహాచిద్విలాసా, పరేశా, విపాశా, షడాస్యా, విశాఖా, ద్విషచ్ఛూల, మందాకినీ పుత్ర, మీదివ్యలీలావిలాస ప్రభావప్రకారంబులా నిర్జరా ధీశ కాకోదరా ధీశ వాణీశ కీనాశముఖ్యుల్ గనన్ లేరనంగా నికేన్ మిమ్ము భావించివర్ణింప నేనెంత వాడన్ మహాదుష్టుడన్ కష్టుడన్ పాపుడన్ మూఢుడన్ దేవదేవా, బిలేశా, జగన్నాథ, జ్యోతిర్మయా, శక్తిధారీ, పరంధామ కారుణ్య సింధూ, మహాదీనబంధూ, కృతాంతారిసూనూ, విపద్ధ్వాంతభానూ, జగన్మోహనా, దుష్టసంశిక్షణా, శిష్టసంరక్షణా, తొల్లి బాల్యంబు నందీవు షట్కృత్తికా స్తన్యముంగ్రోలుచో వారు సమ్మోదముంబొందగా నాఱు రూపంబులందాల్చి మాహాత్మ్యముంజూపి భాసింపవే, దేవ, క్రౌంచంబు భేదించి క్రూరాత్ములై లోకజాలంబులన్ హింసించు నా తారాకా శూర పద్మాది దుర్వారగర్వాంధదైతేయులన్ ద్రుంచి ఇంద్రాది బృందారకశ్రేణి సంతోషసౌఖ్యాంబుధిందేల్చి రాణింపవే, జ్ఞానస్వరూపుండవై నీరజాతాసనా కుంభజర్షీం ద్రులం బ్రేమ దళ్కొత్త గూఢాతి గూఢంబునై యొప్పు నోంకారతత్త్వంబు బోధించి మన్నింపవే, నారదున్ మున్ను దేవర్షి సంఘంబునన్ శ్రేష్ఠగావించి పాలింపవే, అంతిమున్ సంధిమున్ వేదనల్ పాపి రక్షింపవే, ఆర్తులన్ సాధులన్ శిష్టులన్ భక్తులన్ బ్రోవ శశ్వద్గతిన్ భూమిపై పెక్కు రూపంబులన్ బూని వెల్గొందుచున్నట్టి మీ మూర్తి నా హృత్పయోజాతమధ్యంబునన్ నిల్పి భావింతు కీర్తింతు సేవింతు పూజింతు నాగోడు నాలించి నానేరముల్ సైచి నాజన్మ జన్మాంతరవ్యాధి కర్మంబులంద్రుంచి యారోగ్యమున్ గూర్చి నాయాత్మ ఖేదంబులం బాపి విస్ఫారసంతోష సౌఖ్యంబులందన్పి దుశ్చిత్తముంద్రోసి,

నిశ్చింతుగా జేసి పాపంబులంగూల్చి పుణ్యంబు సంధించి, అభ్యర్థితంబుల్ ప్రసాదించి రక్షింప రావే, కృపాంభోనిధీ, కార్తికేయా, నమస్తే, నమస్తే నమః

టీక। మహాసేన = కుమారస్వామీ, నిర్వాణసంధాన = మోక్షదాయక, భక్త+ఓఘసంత్రాణ = భక్తులసమూహామునకు రక్షకుడ, కుంభోద్భవ = అగస్త్యమహర్షి, అశేషమౌనీశసంఘాత = సమస్త మునీశ్వరుల సమూహాముచే, సంస్తూయమానా = ప్రశంసింపబడుచున్నవాడా, సుసౌఖ్యప్రదానా = సంతోషమునొసగు వాడ, మహాగర్వనిర్వాపణ = పొగరు నణచుటయందు, అఖర్వ = అనల్పమైన, భీమ = భయంకరమైన, ప్రభావ+అభిరామా = ప్రభావముచే మనోహరుడా, జగద్గేయనామా = లోకమునందు కీర్తింపబడుచున్న పేరుగలవాడా, కృపావార్ధికల్లోల = దయాసముద్రమునందలి పెద్ద అలలచే, భాస్వత్ = ప్రకాశించుచున్న, కటాక్షా = క్రీగంటి చూపులు గలవాడా, విరాజత్ = ప్రకాశించుచున్న, మనోహారి = మనోజ్ఞమైన, శోణ+అంబుజ+అక్షా = ఎఱ్ఱతామరలవంటి నేత్రములు గలవాడ, నతస్తోమరక్షా = భక్తసమూహ రక్షకుడా, ప్రశస్త+అనులాపా = ప్రశస్తముగా భాషించువాడా, నిరస్తోపతాపా = రోగములను తొలగించువాడా, సమస్త+అఘసందోహ = సకలపాపసమూహములను, సంహారకారా = సంహరించు కారణభూతుడా, కుమారా = కుమారస్వామీ, భవానీకుమారా = పార్వతీనందనా, గళ+ఉల్లాసి హారా = కంఠమునందు ప్రకాశించెడి హారములు గలవాడా, నమద్హృద్విహారా = భక్తుల హృదయములలో విహరించువాడా, సులావణ్యగాత్రా = మిక్కిలి సౌందర్యవంతమైన శరీరముగలవాడా, మహాబర్హిపత్రా = నెమలిని వాహనముగా గలవాడా, రుజాకాండ నిర్మూలకా = రోగముల సమూహామును నిర్మూలించెడివాడా, శత్రువిధ్వంసకా = శత్రువులను నాశనము చేయువాడ, సర్వకామ్యార్థ సంధాయకా = సమస్తమైన కోర్కెల ఈడేర్చెడివాడా, కోటిమార్తాండ సంకాశనీకాశ = కోటి సూర్యుల కాంతితో వెలుగొందెడివాడ, వల్లీశ = వల్లీదేవి భర్తయైన వాడా, వేదాంతవేద్య = ఉపనిషత్సారము నెఱిగినవాడ, మహాచిద్విలాసా = గొప్పజ్ఞానముతో ప్రకాశించెడివాడ, పరేశా = పరతత్త్వమునకు ప్రభువైన వాడ, విపాశ = సంసారపాశము తగుల్కొననివాడ, షడాస్య = ఆఱుముఖములు గలవాడ, విశాఖ = విశాఖుడను పేరుతో నొప్పువాడ, ద్విషత్+శూల = శత్రువులకు శూలమువంటివాడ, మందాకినీపుత్ర = గంగానందనా,

నిర్జరాధీశ = దేవేంద్రుడు, కాకోదరాధీశ = నాగేంద్రుడు (ఆదిశేషుడు) వాణీశ = సరస్వతీదేవి భర్తయైన బ్రహ్మదేవుడు, కీనాశ = యమధర్మరాజు, ముఖ్యుల్ = మొదలగువారు, బిలేశా =సుబ్రహ్మణ్యా, జగన్నాథ = లోకరక్షకా, జ్యోతిర్మయా = నిత్యమైన వెలుగుతో నిండినవాడా(జ్ఞానస్వరూపా), శక్తిధారీ = శక్త్యాయుధమును ధరించినవాడా, పరంధామ = పరతత్త్వమే ఉనికిగా గలవాడా, కారుణ్యసింధూ = దయాసముద్రుడా, మహాదీనబంధూ = దీనులకు చుట్టమైనవాడా, కృతాంతారిసూనూ = శివపుత్రా (యముని జయించిన శివుని కుమారా) విపత్ధ్వాంతభానూ = ఆపదలనెడి చీకట్లకు సూర్యుడా, జగత్+మోహనా = లోకజనాకర్షణ కలవాడా, దుష్టసంశిక్షణా = దుర్జనులను దండించువాడా, శిష్టసంరక్షణా = సజ్జనులను సంరక్షించువాడా, షట్కృత్తికాస్తన్యమున్ = ఆఱుగురు కృత్తికలయొక్క చనుబాలను, గ్రోలుచున్ = త్రాగగా, సమ్మోదమున్ = ఆనందమును, భాసింపవే = వెలుగొందవే, నీరజాతాసనా = బ్రహ్మ, కుంభజ+ఋషీంద్రులన్ = అగస్త్య మహర్షులను, బృందారకశ్రేణి = దేవతలసమూహము, శశ్వద్గతిన్ = శాశ్వతమైన వర్తనముతో, హృత్పయోజాతమధ్యంబునన్ = హృదయపద్మమునందు, ఆత్మఖేదంబులన్ = (నా) మనస్సులోని దు:ఖములను, పాపి = తొలగించి, సంధించి = కూర్చి, అభ్యర్థితంబుల్ = కోర్కులు, కృపా+అంభోనిధీ = దయాసముద్రుడా, కార్తికేయా = కృత్తికానందనా (కుమారస్వామీ)

**74)** **దేవా, ఇప్పటికాలకించితివ, నాదీనాతిదీనోక్తులన్**
**కావన్ వచ్చితినన్ను, స్వప్నమున సాక్షాత్కారముంజేసి, నా**
**భావంబిప్పుడు శాంతిజెందెను, భవద్వాల్లభ్యసంవృష్టినా**
**పై వర్షింపుము నిత్యమిట్లె కరుణాపారీణ, షాణ్మాతురా!**

టీక॥ దీన+అతిదీన+ఉక్తులన్ = మిక్కిలి దీనమైన పలుకులను, నా భావంబు = నా మనస్సు, కరుణాపారీణ = దయాస్వరూపా, భవద్వాల్లభ్యసంవృష్టిన్ = కరుణ లేక ప్రేమయొక్క జల్లును,

తా॥ స్వామీ, ఇప్పటికి నా మొఱాలకించితివా, కలలో కనిపించి నన్ను కాపాడవచ్చితివి. నా మనస్సు శాంతించినది. నిత్యము నీ కృపావృష్టి నాపై వర్షింపుము.

**75) కమనీయంబగు నీదురూపమును నాకన్నారవీక్షించి, దే**
**వ, మహానంద రసాబ్ధిలో మునిగి సంప్రాప్తైకచిత్తుండనౌ**
**చు మనంబున్ మఱలింపజాల, నిటులే సొంపార నీపైన ల**
**గ్నము గావింపుము నాదు చిత్తము, ననంతా, దేవ, షాణ్మాతురా!**

టీక॥ మహానందరసాబ్ధి =గొప్ప ఆనందమనెడి సముద్రము, సంప్రాప్త+ఏకచిత్తుండు = చక్కగా ప్రాప్తింబడిన ఏకాగ్రమైన మనస్సు గలవాడు, అనంతా = అంతములేని వాడా,

తా॥ దేవా, మనోహరమైన నీరూపమును చూచి ఆనందజలధిలో మునిగి నా మనస్సును నీ నుండి మఱల్పలేకుంటిని. ఇట్టి స్థితినే నిత్యముగా నాకు ప్రసాదింపుము.

**76) సుబ్రహ్మణ్య, భవాఘదూర, శుభదా, శుద్ధాత్మ, శత్రుంజయా**
**శుభ్రాజిష్ణ, సుభక్తపాలన, మహాసూక్ష్మ స్వరూపాయితా**
**విభ్రంబుంబొనరింపకుండ నను సంవిత్ప్రాభవోపేతుగన్**
**విభ్రాజాత్మునొనర్చిప్రోవుము ప్రభూ విశ్వేశ షాణ్మాతురా!**

టీక॥ భవ+అఘదూర = సంసారమనెడి పాపమును దూరము చేయువాడా, శుభదా = శుభములొసగువాడా, శుద్ధాత్మ = పరిశుద్ధమనస్కుడా, మహాసూక్ష్మస్వరూపాయితా = మిక్కిలి సూక్ష్మ రూపముచే నొప్పువాడా, సుభక్తపాలన = గొప్ప భక్తులను పాలించువాడా, విభ్రాజ+ఆత్ముని = ప్రకాశించు ఆత్మగలవానిగా

తా॥ సుబ్రహ్మణ్య, నా మనస్సును స్థిరపరచి నాహృదయతలమంతయు దివ్యతేజస్సుతో నింపుము. ధన్యుని జేయుము.

**77) పరమానందముతోడ నిన్ను మదిలో భావించి సేవించి స**
**ద్వరముల్ గాంచి యభీష్టముల్ వడసి నీ భక్తవ్రజంబెల్ల సు**
**స్థిర విఖ్యాతిని జెందు నీవు దయవీక్షింపంగ దుస్సాధ దు**
**స్తర దుష్ప్రాపములేలగల్గు నిక విశ్వంబందు షాణ్మాతురా!**

టీక॥ భక్తవ్రజము = భక్తసమూహము, దుస్సాధ = సాధింపరానిది, దుస్తర = తరింపరానివి, దుష్ప్రాప = పొందరానివి.

తా॥ భక్తులు నిన్ను మనసారా ధ్యానించినచో కామితార్థములు పొంది స్థిరపడుదురు. నీవు దయచూపిన సాధింపలేనివి తరింపలేనివి పొందలేనివి ఉండవు గదా.

**78) కనగా భాగ్యపు భోగ్యపుంగరిమచే గర్వాంధులై మేనెఱుం**
**గని పాపాత్మకులైన నొక్కపరి మీ కల్యాణ నామంబు పే**
**ర్కొనినంజాలు నఘంబు వేదొలగు, మీరూపమ్మె నిత్యంబు గొ**
**ల్చిన వాడింక భయంబు జెందునొకొ, కించిత్తైన షాణ్మాతురా!**

టీక॥ గరిమచే = గొప్ప తనముచే, మేను+ఎఱుంగని = ఒడలు తెలియని, కల్యాణనామంబు = శుభకరమైన పేరు, అఘంబు = పాపము, వేదొలగు = వెనువెంటనే తొలగును.

తా॥ భోగభాగ్యాలచే చెలామణియగు ఎంతటి దుర్మార్గులైన ఒక్క పర్యాయము మీ నామస్మరణ చేసినచో పాపవిముక్తులగుదురు. మీ రూపమునే నిత్యము సేవించెడి వాడు ఏ కొంచెము మాత్రమైన భీతి నందదు గదా.

**79) స్థిరకీర్తిన్ వెలయంగజేసి నిఖిల శ్రేయంబులం గూర్చి దు**
**స్తర దు:ఖంబుల బారద్రోలి విలసత్సంపన్నతోద్యోగముల్**
**బరగంగా ఘటియించి కామితఫల ప్రాప్త్యానుకూల్యంబులన్**
**సరవిన్ నించుచు మించు మీ భజనమశ్రాంతంబు షాణ్మాతురా!**

టీక॥ దుస్తర దు:ఖంబులన్ = దాటరానిదు:ఖ పరిస్థితులను, కామితఫల ప్రాప్త్యానుకూల్యంబులన్ = కోరిన కోర్కెలను పొందుటకు అనుకూల పరిస్థితులను, సరవిన్ = క్రమముగా, నించుచున్ = సమకూర్చుచు, మించు = ప్రకాశించు, మీభజనము = మీసేవ, అశ్రాంతంబు = ఎల్లవేళల

తా॥ మీసేవ చేసినచో చిరయశస్సు చేకూరును. సకల శుభములు కలుగును. తరింపరాని దు:ఖముల నుండి విముక్తి కలిగించును. ఉన్నత స్థితిగతులు కలుగును. కోరిన కోర్కెలు ఫలించును.

**80) ఎఱుగన్ జాలక నీదు దివ్యమహిమంబేమేమి వాకొంటినో
పరుషమ్ముల్, క్షమియింపుమయ్య నను త్వద్భవ్యాంఘ్రియుగ్మంబు ని
ర్భర చిత్తాన స్మరింతు వేదమయ వాక్ప్రస్తూయమానా, దయా
దరభావంబున జూడు మెప్పుడును భక్తత్రాణ, షాణ్మాతురా!**

టీక॥ వాకొంటినో = మాటాడితినో, త్వద్+భవ్య+అంఘ్రియుగ్మంబు = నీ యొక్క దివ్యమైన పాదాలజంటను, నిర్భరచిత్తానన్ = నిండుమనస్సుతో, వేదమయ వాక్ ప్రస్తూయమానా = వేదములోని స్తోత్రములచే ప్రశంసింపబడుచున్నవాడా, భక్తత్రాణ = భక్త రక్షకుడా,

తా॥ నీమహిమ తెలియక ఏమేమో పరుషములు పలికితిని. క్షమింపుము. వేదమంత్రాలతో స్తుతి చేయబడు మహానుభావా, నిండుమనస్సుతో నీ పాదపద్మాలను స్మరించుచున్నాను. భక్త రక్షకా, దయజూడుము.

**81) తురగంబుల్ రథముల్ ధనంబు మణి సందోహంబు దివ్యాంబరా
భరణాదుల్ మడి మాన్యముల్ సకల సంపద్భోగ సామ్రాజ్యముల్
కరుణింపంగను రమ్మటంచు నిను నే కాంక్షింప యుష్మత్పద
స్థిరబుద్ధింగను వానికేల నవి చింతింపంగ , షాణ్మాతురా!**

టీక॥ మణి సందోహంబు = రత్నాల సమూహము, దివ్య+అంబర+ఆభరణాదుల్ = గొప్ప వస్త్రములు, నగలు మొదలగునవి, మడిమాన్యముల్ = భూములు, నేకాంక్షింపన్ = నేను కోరను, యుష్మద్+పదస్థిరబుద్ధిన్ = నీయొక్క పాదములందు నిలకడగానుండు బుద్ధిని

తా॥ గుఱ్ఱాలు, రథములు, ధనము, మణులు, వస్త్రాలు, నగలు, భూములు, సంపదలు, భోగాలు, ఇమ్మని నేను కోరను. నీ భక్తులకు అవియేల?

**82) బహుజన్మంబుల నుండి చేసిన మహాపాపంబు దూలించి దు
ర్గ్రహదౌష్ట్యమ్ముడిగించి రోగభయవైకల్యంబులంద్రుంచి దు
స్స్పహ దోషంబుల రూపడంచి రిపు దుస్తంత్రంబులన్ మాపి స
మ్మహితోదార సుఖంబు నించి యిటులే మన్నింపు షాణ్మాతురా!**

టీక॥ మహాపాపంబు = మహాపాపము, దుర్గ్రహదౌష్ట్యమ్ము = చెడు గ్రహములొనరించు దుశ్చర్యలను, ఉడిగించి = పోగొట్టి, వైకల్యము = వికలత్వము, రిపుదుస్తంత్రము = శత్రువులు చేయు దురాలోచనలను,

తా॥ బహుజన్మాల పాపము, దుష్టగ్రహాలప్రాబల్యము, రోగభయాలను, శత్రువుల దుస్తంత్రములను రూపుమాపి సుఖము నిమ్ము.

**83) జ్ఞాతిద్రోహులు, కొండెగాండ్రు, కపట స్వాభావ్యశీలు ర్దయా**
**వీతస్వాంతులు, బంధుమిత్రజనవిద్వేషక్రియా ఘాతుక**
**వ్రాతమ్ముల్ చెలరేగినట్టి కలిదౌర్జన్యం బెటుల్ దాట! చిం**
**తాతాపమ్ములడంచి కావుము దయార్ద్రస్వాంత! షాణ్మాతురా!**

టీక॥ జ్ఞాతిద్రోహులు = ద్రోహులైన దాయాదులు, కొండెగాండ్రు = చెప్పుడుమాటలు పలికెడివారు, కపటస్వాభావ్యశీలురు = వంచకులు, దయావీత స్వాంతులు = నిర్దయులు, ఘాతుకవ్రాతమ్ముల్ = బంధువులకు మిత్రులకు ద్వేషభావమును కలిగించెడి దుర్మార్గులు. చింతా తాపమ్ముల్ = దు:ఖబాధలను, అడంచి = తొలగించి.
తా॥ ద్రోహులయిన దాయాదులు, కొండెగాండ్రు, వంచకులు, నిర్దయులు బంధుమిత్రజనులకు విద్వేషభావము కలిగించెడివారు ప్రబలిన ఈఘోరకలిని దాటుటెట్లు? నాదు:ఖమును పోగొట్టి దయజూపుము.

**84) నినువర్ణింపగ జాలు జిహ్వయును, నిర్నిద్రప్రమోదావహా**
**వనమౌ నీకథలాలకించు చెవులున్ త్వన్మూర్తి వీక్షించులో**
**చనముల్, నిన్ను నుతించు బుద్ధియును, నిచ్చల్ నిన్ను పూజింపగా**
**ననువౌ హస్తయుగంబు నాకొసగుమయ్యా, చాలు, షాణ్మాతురా!**

టీక॥ జిహ్వ = నాలుక, నిర్నిద్రప్రమోదావహ+అవనమౌ = ఎడతెగని ఆనందము కలిగించి రక్షించువాడా, త్వన్మూర్తి = నీరూపము, లోచనముల్ = కన్నులు, హస్తయుగము = చేతులజంట

తా॥ నీస్తుతి చేసెడి నాలుక ఆనందమయమైన నీ కథలాలకించెడి చెవులు, నీరూపుచూచెడి కన్నులు, నిన్ను స్తోత్రముగావించెడి బుద్ధి, నిన్ను పూజించెడి చేతులు నాకొసగుము చాలును.

**85) ఎవడైనన్ జనుదెంచి మామక సహాయేచ్ఛార్థిప్రార్థింప, కా**
**దవునంచాడక చేతనైన గతి సాహాయ్యంబు గావించుచున్**
**సవిశేషంబుగ తోడ్పడంగ నగు సచ్ఛక్తిం బ్రసాదించి నన్**
**భువిలో వర్ధిలజేయుమింక ఇతరంబుంగోర షాణ్మాతురా!**

టీక।। మామక = నాయొక్క, సహాయ+ఇచ్ఛార్థి = సాయము చేయుమని కోరుచు, ప్రార్థింప = ప్రార్థింపగా, సత్+శక్తిన్ = గొప్పశక్తిని.
తా।। ఎవరైన వచ్చి సాయమర్థించినపుడు కాదనక చేసెడి శక్తిని ప్రసాదించి ఈలోకమున నన్ను వర్ధిల్ల జేయుము. వేఱొదియును వాంఛింపను

**86) నీదాక్షిణ్యము, నీ మహామహిమమున్, నీ భక్తవాత్సల్యమున్**
**నీ దీనార్థిజనైక పోషణ మహానిర్వ్యాజసంపత్తి, ఇం**
**కే దైవంబుల యందు లేదని యెలుంగేపార చాటింతు నే**
**నీ ధాత్రీ తలమందు నంతటను తండ్రీ, యింక షాణ్మాతురా!**

టీక।। దాక్షిణ్యము = దయ, మహామహిమ = గొప్పమహిమ, భక్త వాత్సల్యము = భక్తులయెడల ప్రేమ, దీనజనార్థిపోషణ = దీనజనులను పోషించుటయందు, మహానిర్వ్యాజసంపత్తి = గొప్ప కాపట్యములేని సంపన్నతాభావము,
తా।। నీదయ, నీభక్తజనప్రేమ, దీనజనపోషణమునందు నీవు పాటించెడి నిష్కాపట్యసంపన్నత ఇంకేదైవములందు లేదని భూతలమందు గొంతెత్తి చాటెదను.

**87) ఫలపర్ణాంబు సుమంబులిచ్చిన ననల్ప ప్రీతి గైకొంచు ను**
**జ్జ్వలభద్రంబులు గూర్చి భక్తుల సదా సంరక్షణల్ సేయు నీ**
**కల రూపారయలేక దుర్భర విపత్ కాలానలజ్వాల కే**
**వల మూఢత్వముచే నశింత్రు మనుజుల్ భగ్నాశ షాణ్మాతురా!**

టీక।। ఫలపర్ణ+అంబుసుమంబులు = పండ్లు, ఆకులు, నీరు, పూలు, ఉజ్జ్వల భద్రంబులు = స్వచ్ఛమైన శుభములు, నీకలరూపు+ఆరయలేక = నీనిజ తత్త్వమును తెలియక, దుర్భర విపత్ కాల+అనలజ్వాలన్ = భరింపరాని, ఆపదలనెడి ప్రళయకాలమందలి అగ్ని జ్వాలయందు, మూఢత్వము = అజ్ఞానము, భగ్నాశ = కొఱమాలిన కోరికలతో

తా॥ పండ్లు, ఆకులు, నీరు, పూలు ఇచ్చినచో అనల్పమైన ప్రీతితో స్వీకరించి వెలుగు లీనెడి శుభములిచ్చెడి నీకల రూపు తెలిసికొనలేక భరింపరాని ఆపదలనెడు ప్రళయ కాలాగ్నిలో చిక్కి మూఢులై, దిక్కులేనివారై మనుజులు నశించుదురు.

**88) ఖలులై ధర్మవిహీనులై కపటులై గర్వాంధులై ధూర్తులై**
**మలినీభూతమనస్కులై కుటిలులై మాత్సర్యవిక్రీడులై**
**పలురోగంబులబారికగ్గ మగుచున్ భ్రష్టాత్ములై పుట్టు వా**
**రిల నిన్ గొల్వని మానవాధములు గారే, తండ్రి, షాణ్మాతురా!**

టీక॥ ఖలులై = పాపులై, ధర్మవిహీనులై = ధర్మమును పాటింపని వారై, కపటులై = వంచకులై, గర్వాంధులై = గర్వముచే కన్నుగాననివారై, ధూర్తులై = మోసగాండ్రై, మలినీభూత మనస్కులై = మలినత్వముతో కూడిన మనస్సులు గలవారై, కుటిలులై = వక్రబుద్ధిగలవారై, మాత్సర్యవిక్రీడులై =ఈర్ష్యతో సంచరించువారై, పలు రోగంబులబారికగ్గమగుచున్ = అనేక రోగములకు గురియై, భ్రష్టాత్ములై = దిగజాఱిన (పతనమైన) మనస్సులుగలవారై, మానవాధములు = నీచమానవులు.
తా॥ పాపులు, అధర్మపరులు, గర్వాంధులు, వంచకులు, పాపహృదయులు, వక్రబుద్ధులు, ఈర్ష్యాళువులు, రోగులు, నీచహృదయులు లోకములో జన్మించి నిను గొల్వక మానవాధములగుచున్నారు.

**89) బలవిభ్రాజతులై యశోభరితులై, భద్రాఢ్యులై, పుణ్యులై**
**ఫలితానందదులై విశుద్ధమతులై భక్త ప్రమోదాత్ములై**
**విలసద్ధర్మ విభూషణాభిగములై విద్వాంసులై పుట్టు వా**
**రిల నిన్ గొల్చిన మానవోత్తములు, తండ్రీ, దేవ, షాణ్మాతురా!**

టీక॥ బలవిభ్రాజితులై = బలముచే విశేషముగా ప్రకాశించువారై, యశోభరితులై = కీర్తి పరులై, భద్రాఢ్యులై = శుభులై, ఫలిత+ఆనందదులై = ఫలింపబడిన ఆనందము నొసంగువారై, విశుద్ధమతులై = స్వచ్ఛమైన మనస్సుగలవారై, భక్త ప్రమోదాత్ములై = భక్తులచే ఆనందించుమనస్సులు గలవారై, విలసత్ ధర్మ విభూషణ+అభిగములై = ప్రకాశించెడి ధర్మమనెడి అలంకరణమును పొందువారై, విద్వాంసులై = పండితులై (జ్ఞానులై)

తా॥ బలవంతులు, కీర్తి పరులు, శుభసంపన్నులు, స్వచ్ఛమనస్కులు, భక్త ప్రమోదితులు, ధర్మం అలంకరణముగగలవారు, పండితులు ఈ లోకమున జన్మించి నిన్ను సేవించి మానవోత్తములగుచున్నారు.

**90) రూకల్ గల్గినవాడె లోకమున నిర్ధూతాఘుడన్నట్లు సు**
**శ్లోకుండై కనుగౌరవాదరము లస్తోకంబుగా, నేడు వి**
**ద్యాకౌశల్యము గల్గు పండితుడు దైన్యావస్థ కూపస్థమం**
**దూకంబుంబలెనొప్పు నేమిటిది విడ్డూరంబు షాణ్మాతురా!**

టీక॥ రూకల్ గల్గినవాడె = ధనవంతుడే, నిర్ధూత+అఘుడు = పోగొట్టుకొన బడినపాపము గలవాడు, (పుణ్యాత్ముడు) మన్ననల్ పడసి = గౌరవాదరములు పొంది. కూపస్థమండూకంబుంబలె = బావిలోని కప్పవలె.

తా॥ ధనవంతుడగువాడే లోకములో పుణ్యాత్మునివలె పొగడదగినవాడై గౌరవాదరములు పొందుచు చెలామణి అగుచున్నాడు. విద్యావిశారదుడైన పండితుడు మాత్రము బావిలోని కప్పవలె అణగారియున్నాడు. ఇదియేమి వింత స్వామీ.

**91) నోరుంగల్గినవాడు పల్కినది యెందున్ వాసికెక్కంగ నె**
**వ్వారున్మారు వచింపబోరు, సుజనుల్ వాక్రుచ్చుధర్మక్రియా**
**ధారాధ్వంబును గానబోవక దురర్థప్రాపణో న్మాదులై**
**వీరంగంబు సృజించు దుర్విధినెటుల్ ఛేదింతుషాణ్మాతురా!**

టీక॥ వాసికెక్కంగ = ప్రసిద్ధిపొందగా, ధర్మక్రియాధారా+అధ్వంబును = ధర్మాచరణ పరంపరామార్గమును, కానబోవక = పరికింపక, దురర్థప్రాపణ+ఉన్మాదులై = చెడు అర్థముగైకొనిపిచ్చివారుగా, వీరంగంబు సృజించు = గంతులువేయు, దుర్విధిన్ = చెడుపద్ధతిని ఛేదింతు = తొలగింతును.

తా॥ నోరుగల్గినవాడు మాటాడునది ప్రసిద్ధికెక్కుచున్నది. వాని కెదురుగానెవ్వరు మాటాడరు. సజ్జనులమాటలకు మాత్రము పెడర్థములు తీసి వాక్రుచ్చుచు ఆవేశముతో గంతులు వేయుచున్నారు. స్వామీ దీనిని తొలగించుటెట్లు?

**92) ధనమే సాధనమెల్లకార్యములకున్ తర్కింపగా దీనికం**
**టెను మిన్నైనది వేఱొకండు భువి లేనేలేదటంచున్మదిన్**
**గని భావించి తదీయ లబ్ధికొఱ కన్యాయంపు మార్గానువ**
**ర్తను లైకొందఱు పోదురేలచెడి ఆర్తత్రాణ, షాణ్మాతురా!**

టీక॥ తదీయలబ్ధికొఱకు = దానిని పొందుటకై, ఆర్తత్రాణ = దు:ఖితులను రక్షించువాడ
తా॥ సకలకార్యములకు ధనమే మూలమని దానిని పొందుటకై అధర్మ వర్తనులై కొందఱు మానవులు చెడుచున్నారు.

**93) ధరణిన్ దుష్టపథానువర్తనుని తత్త్వంబెట్టిదో సుంతయే**
**నెఱుగన్నేరక చెడ్డవల్వదని తారేదేని బోధింప సా**
**దరబుద్ధింగొని సమ్మతించునొకొ ఆదౌర్భాగ్యు డూహింపగాన్**
**కిరి పంకంబునె మెచ్చు, మెచ్చునొకొ పన్నీరెందు, షాణ్మాతురా!**

టీక॥ ధరణిన్ = లోకమందు, దుష్టపథ+అనువర్తనుని = చెడుమార్గము ననుసరించువానిని, దౌర్భాగ్యుడు = దురదృష్టవంతుడు, కిరి = పంది, పంకంబు = బురద.
తా॥ దుర్మార్గునికి చెడు చేయవలదని బోధించినచో వాడు సాదరభావముతో స్వీకరించునా, స్వీకరింపడు. పంది బురదనే మెచ్చును. పన్నీరు మెచ్చునా?

**94) ఎన్నేనేండ్లుగ మాదుపంచదిని మాకే పంగనామాలు దీ**
**ర్చన్నోపంగల భూరిఘాతకుల లజ్జాహీన చేష్టల్ కటా**
**అన్నా, కాంచితె, ఇద్దియాయుగము మాహాత్మ్యంబె కాకున్నచో**
**ఎన్నండేనియు నిట్టి హీనులుదయింత్రే, దేవ, షాణ్మాతురా!**

టీక॥ భూరిఘాతకులు = మిక్కిలి దుర్మార్గులు, లజ్జాహీనచేష్టల్ = సిగ్గులేని పనులు
తా॥ మా సొమ్ముకొన్నేండ్లు మాయింటబడితిని మాకే హాని చేయబూనిన పాపాత్ములచూచితివి గదా. ఇది యీ కలియుగ ప్రభావమా? మఱేమి? ఇట్టి వారుకూడ లోకములో నుందురా?

**95) కులుకుంబ్రాయము వచ్చినట్టి చిగురాకుంబోండ్ల కౌగిండ్లలోన్**
**బలిమింజిక్కియు బాధలంజివికియున్ మానంబు గోల్పోయినన్**
**వలపున్ వీడరు వారినేమతిమతిన్ వర్ణించి చేరంగ న**
**ర్మిలి భావింతురు మానవా ధములు తండ్రీ యేల షాణ్మాతురా!**

టీక॥ కులుకుంబ్రాయము = యౌవనముతో సంచరించెడి వయస్సు, చిగురాకుంబోండ్ల = యువతులను, చివికియున్ = కృశించియు, అర్మిలి = అపేక్ష.

తా॥ నరులు యువతులతో ఎంతకాలము కామసుఖములనుభవించినప్పటికి ధనమానములను కోల్పోయినప్పటికి వారిని వీడరు. మానవాధములైన వీరు వారి పొందుకై మతిమతి అపేక్షింతురు.

**96) "తళుకుంజెక్కులు, గబ్బిగుబ్బలును నుద్యద్రాజబింబాస్యమున్**
**చలదాలోల విలోచనాలనుచు" నిచ్చల్ స్త్రీల వర్ణింపనే**
**మి లభించున్ వెతదక్క, మిమ్ము దలపన్ మించుంగదా సద్యశో**
**విలసత్సౌఖ్యసమస్త సంపదలు పృథ్విన్, దేవ, షాణ్మాతురా!**

టీక॥ తళుకు+చెక్కులు = మెఱసెడి చెక్కిళ్ళు, గబ్బిగుబ్బలును = బలిసినస్తనములు, చలత్+ఆలోలవిలోచనాలు = చలించు ఆసక్తితోకూడిన నేత్రములు, నిచ్చల్ = నిత్యము, వెత = బాధ, అతిశయించును గదా, సత్+యశోవిలసత్సౌఖ్యసమస్త సంపదలు = సత్కీర్తితో ప్రకాశించెడి సుఖముతో కూడిన సకల సంపదలు, పృథ్విన్ = భూతలమందు, ఉద్యత్+రాజబింబాస్యము =ప్రకాశించెడి చంద్రబింబమువంటి ముఖము

తా॥ స్వామీ,, మెఱయుచున్న చెక్కిళ్ళు, బలిసిన స్తనములు, చంద్రబింబమువంటి ముఖము, చపలనేత్రాలు అని నిత్యము స్త్రీలను వర్ణింపగా వ్యధతప్పఏమి సమకూడును? నిన్ను తలంచినచో సత్కీర్తి, సౌఖ్యము, సంపదలు ఈలోకాన వెలుగును గదా.

**97) కవిసింహంబు లటంచు నేవౌబిరుదుల్ గైసేసి యెల్లప్పుడున్**
**నవనీరేరుహపత్ర నేత్రల గమిన్ ప్రత్యంగ వర్ణక్రియా**
**స్తవముల్ సేయుచు కాలమంతయును వ్యర్థంబౌగతిన్ బుచ్చి తా**
**రవురా! వెన్కవిపద్దశాబ్ధి బడనేలా, తండ్రి, షాణ్మాతురా!**

టీక॥ కైసేసి = పొంది, నవనీరేరుహపత్రనేత్రల గమిన్ = నూతన తామరపత్రమువంటి నేత్రములు గలస్త్రీల సమూహములో, ప్రత్యంగ వర్ణ క్రియాస్తవముల్+చేయుచు = ప్రతి శరీరభాగమును వర్ణించి స్తోత్రములు చేయుచు, విపత్+దశా+అబ్ధి = ఆపద అనెడి సముద్రమునందు, పడనేలా = పడుటయెందులకు

తా॥ 'కవిసింహము'లనెడి బిరుదులు పొంది అనునిత్యము స్త్రీల యొక్క అంగాంగ వర్ణనచేయుచు కాలము వ్యర్థపఱచి తుదకు ఆపదలపాలు గానేల?

**98) నాస్తిక్యమ్మహో, చుట్టుముట్టుకొని విన్యాసంబు గావించు నే**
**డాస్తిక్య ప్రతిపాదకమ్ములగు వాక్యార్థంబులంజెప్పనా**
**ర్య స్తోమంబవి విందుగూర్చునె? వృథాప్రాయాసమౌగాని, ఈ**
**అస్తవ్యస్త మడంపలేకునికి ధర్మ్యంబౌనె? షాణ్మాతురా!**

టీక॥ ఆర్యస్తోమంబు = పూజ్యులసమూహము, అస్తవ్యస్తము = తారుమాఱయిన పరిస్థితి, అడంపలేకునికి = తొలగింపలేకుండుట, ధర్మ్యంబు+ఔన్ = ధర్మపద్ధతి అగునా.

తా॥ నాస్తికత్వము ఈనాడు లోకమున ప్రబలినది. పెద్దలు ఆస్తికత్వము నెలకొల్పుటకై చేయు ప్రసంగములు జనుల చెవి కెక్కుట లేదు. ఈ అస్తవ్యస్తమైన పరిస్థితి తొలగింపలేకుండుట ధర్మమగునా?

**99) క్షితిలో కొందరు వారివారి మతముల్ శ్రేష్ఠంబులన్యంబులౌ**
**మతముల్ దీటుకు రావటంచు నెవియోమాటల్ పిసాళించి మూ**
**ఢత వాదంబులు జేసి తన్నుకొనుచుండన్ జూడవా, మీకు స**
**మ్మతి గానట్టి మతంబు వేఱుగలదే? మాంపాహి, షాణ్మాతురా!**

టీక॥ క్షితిలో = భూతలమందు, మాటల్పిసాళించి = మాటలతో మోసపుచ్చి, మాంపాహి = నన్ను కాపాడుము.

తా॥ ఈలోకములో కొందఱు వారి మతమే గొప్పదని ఇతరుల మతాలు పనికిరానివని మాటలతో మోసపుచ్చుచు జనుల రెచ్చగొట్టి తన్నులాటలకు దారిదీయుచున్నారు. స్వామీ, మీకు సమ్మతి గానట్టి మతమేదైన కలదా? నన్ను కాపాడుము.

**100) కాషాయాంబరముల్ ధరించి, అఱుతన్ గైసేసి రుద్రాక్షతా**
**భూషల్, మాలను కేలద్రిప్పుచును సంపూర్ణాట్టహాసంబుతో**
**వేషంబుల్ పచరించి వేదికలపై వేదాంత గూఢార్థముల్**
**ఘోషింపంగనె ముక్తులై చనుదురొక్కో? దేవ, షాణ్మాతురా!**

టీక॥ అఱుతన్ =మెడలో, కైసేసి = అలంకరించి, వేదాంతగూఢార్థముల్ = ఉపనిషత్తులరహస్యాలను, ఘోషింపంగనె = చాటిచెప్పగానే, ముక్తులై చనుదొరొక్కో = మోక్షానికి వెడలుదురా
తా॥ కాషాయవస్త్రాలు ధరించి, మెడలో రుద్రాక్షలు వేసికొని జపమాల ద్రిప్పుచు వేదికలపై వేదాంత తత్త్వరహస్యాలను చాటి చెప్పి నంతనే ముక్తులయ్యెదరా? కారు.

**101) పరుషాలాపములుజ్జగించి పరులన్ బాధించుటల్ మాని మీ**
**వరనామామృతసారమానుచు తగన్వర్తించుచున్ నిత్యమున్**
**పరమానందము దు:ఖమున్ సమముగా భావించుచున్ తన్ను దా**
**నెఱుగన్ గాంచినవాడు మిమ్ము గను గాదే, దేవ, షాణ్మాతురా!**

టీక॥ పరుషాలాపములు = కఠినమైన మాటలు, ఉజ్జగించి =విడనాడి, మీవరనామామృతము+ఆనుచు = మీశ్రేష్ఠమైన నామామృతము గ్రోలుచు, తన్నుతాన్+ఎఱుగన్కాంచినవాడు = ఆత్మస్వరూపము నెఱిగినవాడు.
తా॥ కఠినోక్తులు పలుకుటమాని, ఇతరులను బాధింపకుండ, మీ నామమునే పలుకుచు ద్వంద్వముల కతీతుడై ఆత్మజ్ఞుడైన వాడె మిమ్ము గాంచును.

**102) కనులంగానక బాహుదర్పధృతి లోకంబుల్ ప్రపీడించు న**
**ద్దనుజుం దారకు రూపుమాపి సురసంతాపంబు పోకార్పవే**
**చనునే యీయెడ నీదు భక్తతతి హాస్యంబాడు దుర్మార్గులన్**
**ఘనులన్ జేయుట నీకు పాడియె, జగత్కల్యాణ షాణ్మాతురా!**

టీక॥ బాహు దర్పధృతిన్ = భుజబలగర్వముతో, ప్రపీడించు = బాధించు, సురసంతాపంబు = దేవతలదు:ఖమును, పోకార్పవే =తొలగింపవా, పాడియె = ధర్మమా

తా॥ కన్నుగానక భుజబల గర్వాతిరేకముతో లోకాలను బాధించెడి తారకాసురుని పరిమార్చి దేవతలకు దు:ఖము పోగొట్టితివి గదా? నీ భక్తసమూహమును గేలిసేసెడివారిని ఘనులను జేయుట ధర్మమా?

**103) దురహంకార మదాభిమానులయి ప్రొద్దున్ మాపులన్ వ్రేల్మిడిన్**
**దురితంబుల్ బచరించుచున్ పయి విపత్తుల్ ముట్టి పీడింపగా**
**తెరువుంగానక దేవరా, ముడుపులన్ జెల్లింతు మంచుంబొరిం**
**బొరి వాపోవుచువేడ ప్రోతువటె, నీవున్ నేర్చితే మాప్రజా**
**పరిణేతల్ కడ లంచగొండి తనమప్పా, నేడు, షాణ్మాతురా!**

టీక॥ ప్రొద్దున్మాపులన్ = రాత్రింబవళ్లు, వ్రేల్మిడిన్ = త్రుటిలో, దురితంబుల్ పచరించుచున్ = పాపములు చేయుచు, ప్రజాపరిణేతల్ = ప్రజానాయకులు

తా॥ అహంకారముతో గర్వాంధులై రాత్రింబవళ్ళు పాపాలు చేయుచు ప్రజలకు ఆపదలు గల్గించుచు బాధింపగా ఇంకేమార్గములేక స్వామీ, నీకు ముడుపులిచ్చెదమ”నిన వెంటనే వారిని రక్షించుచున్నావట! మాప్రజానాయకుల దగ్గర ఈలంచగొండితనము నేర్చితివా?

**104) అరరే! పాపమటంచు భీతిలక నైచ్యంబైన తంత్రంబులన్**
**పరజీవంబులనక్కటా, బలిగొనన్ యత్నంబులన్ జేయు ము**
**ష్కరులన్ 'జంకుజతాల' వేగ పరిమార్పంజేసి నీ భక్తులన్**
**నిరతానందుల జేయుటెన్నడొకొ? తండ్రీ, దేవ, షాణ్మాతురా!**

టీక॥ పరజీవంబుల = ఇతరప్రాణులను, ముష్కరులన్ = క్రూరులను, జంకుజతాల = పాపభీతిలేని దుర్జనులు, వేగ = వేగముగా, పరిమార్పంజేసి = సంహరించి, నిరత+ఆనందుల = ఎల్లప్పుడు ఆనందించు వారినిగా

తా॥। స్వామీ, పాపభీతిలేక క్రూరాత్ములు కత్తుల కటారులతో జీవహింస చేయుచున్నారు. వారిని పరిమార్చి నీ భక్తులను నిరతము ఆనందించువారినిగా ఎన్నడు చేయుదువోగదా.

**105) ధనధాన్యంబుల మత్తులో నెదిరినిన్ తన్ గానరాకుండ సం**
**జనితాహంకృతి తుచ్ఛబుద్ధులయి కక్షల్‌రేపి గ్రామంబులం**
**దున కొంపల్ రగిలింపగా మిగుల నుద్యోగించు చండాలురం**
**గని నిశ్చేష్టతనున్న నవ్వదొకొ లోకంబెల్ల షాణ్మాతురా!**

ఎదిరినిన్‌తన్ = ఎదుటివారిని, తనను, కానరాకుండ = లక్ష్యపెట్టక, సంజనితాహంకృతిన్ = పెల్లుబికిన అహంకారముతో, ఉద్యోగించు = ప్రయత్నించు, నిశ్చేష్టతన్ = క్రియా శూన్యతతో

తా॥ ధనధాన్యసంపదలతో అహంకారులై కన్ను మిన్నుగానక గ్రామాలలో కక్షలు రేపి నాశనమొనరించువారిని ఏమియు చేయక ఊరకున్న లోకము నవ్వదా, ప్రభూ.

**106) పరులేరేనియు స్వార్జితస్థలములన్ ప్రాకారముల్ గట్టగా**
**దొరకొన్నంతనె 'కుళ్లుబోతులయి' బూతుల్‌గూయుచున్ దుర్మదో**
**ద్ధరతన్ కొందఱు విఘ్నముల్ సలుప యత్నంబెంతొ కావింతు రీ**
**దురితస్వాంతుల కెగ్గు సిగ్గవురలేదో యేమొ? షాణ్మాతురా!**

టీక॥ పరులు+ఏరేనియు = ఇతరులెవరైనా, దొరకొన్నంతనె = పూనుకొననగా, దుర్మద+ఉద్ధరతన్ = పొగరుబోతు తనముతో పొంగులు వారుచు, దురితస్వాంతులకు = పాపాత్ములకు

తా।। పరాయి వారెవరో తాము సంపాదించుకొన్న స్థలములందు ప్రాకారములు గట్టుకొనుచుండగా దుర్మార్గులు ఓర్వలేని తనముతో వారికి విఘ్నములు గల్గింతురు. ఇట్టి దుర్మతులకు ఎగ్గుసిగ్గు కూడ ఉండదా? స్వామీ నీవే పరికింపుము.

**107) దురితంబిద్ది యటంచు మానసమునందున్ సుంతయోజింపకే**
**అరరే, దారిన బోవు నెల్లరను ఆహ్వానించి గేహాలకున్**
**పరులంగూరిచి కల్లబొల్లి కథలన్ వాక్రుచ్చి నిందించు మా**
**దురహంకారుల గంతులంగనియు నేదో పట్టనట్లున్న ఈ**
**ధరలో భక్తుల కేది దిక్కిక? మహాత్మా, దేవ, షాణ్మాతురా!**

టీక।। దురితంబు+ఇద్ది = ఇది పాపము, యోజింపకే = ఆలోచింపక,

తా।। పాపచింతయే లేక దారినబోవువారిని తమ ఇళ్లకాహ్వానించి వారికి ఇతరులను గూర్చి కల్లబొల్లిమాటలు చెప్పి గంతులు వేయుచున్న పరమదుర్మార్గులను నీవు పట్టించుకొనకున్నచో నీ భక్తులకిక దిక్కేది స్వామీ.

**108) క్రూరాత్ముల్ భవితవ్యముంగనక దుర్దోషావలంబంబునన్**
**కారుల్ ప్రేలుచు సజ్జనప్రకరమున్ గారించుయత్నంబునన్**
**బారల్ సాచెద, రోర్మిదాని క్షమియింపంబూనినన్ వారు, త**
**ద్ఘోరాఘాంబుధి ముంచి ముంచి జముడుం గూల్పుండొ, షాణ్మాతురా!**

టీక।। భవితవ్యమున్+కనక =జరుగబోవుదానిని గూర్చి తలపక, దుర్దోషావలంబంబునన్ = మిక్కిలి పాపచర్యకు పూనుకొని, కారుల్ప్రేలుచు = చెడుమాటలు పలుకుచు, సజ్జనప్రకరమున్ = సజ్జనసమూహమును, కారించు = బాధించు, ఓర్మి = సహనముతో, తద్ఘోర+అఘ+అంబుధి = ఆ భయంకరపాపసముద్రము, జముడు =యముడు

తా।। భవిష్యత్తును తలపక క్రూరులు పాపము చేయుటకై పూనుకొని సజ్జనుల నిష్కారణముగా నిందించుచుండ దానిని ఓర్పుతో వారు క్షమించినను ఆ క్రూరులను యముడు తప్పక కూల్చును.

**109) త్రాగుంబోతుల పోల్కినెప్పుడు నసందర్భప్రలాపమ్ములన్**
**వాగంగా గమకించు దుర్మదనదుర్వారైక చారిత్రులన్**
**వేగన్ యుష్మదఖండ వీక్షణసమున్మేషాగ్నితోపింప నీ**
**ఱ్ఱాగన్ నీవు దహింపకున్న నదియున్ రమ్యంబె? షాణ్మాతురా!**

టీక॥ వాగంగా గమకించు = మాటాడుటకు ప్రయత్నించు, దుర్మదనదుర్వారైక చారిత్రులన్ = మదమెత్తి వారించుటకు వీలుగాని నడవడి కలిగిన వారిని, యుష్మద్ = మీయొక్క, అఖండ = సంపూర్ణమైన, వీక్షణసమున్మేష+అగ్నితో = ప్రజ్వరిల్లు నేత్రాగ్నితో, నీఱు+కాగన్ = బూడిదయగునట్లుగా,

తా॥ తాగుబోతులవలె విచ్చలవిడిగా సంచరించుచు కారుకూతలు కూయు దుర్జనులను నీ ప్రచండ నేత్రాగ్నితో కాల్చి బూదిసేయకున్నలోకము మెచ్చదు గదా!

**110) పైకేమో కడుబుద్ధిమంతులుగ నొప్పారంబ్రవర్తించి లో**
**లోకమ్మున్ తమకుత్సితంపుమతి కల్లోలంబు గావించి పెన్**
**కాకన్ కొంపల గూల్చు ధేనుముఖ వ్యాఘ్రశ్రేణి చక్కాడి నీ**
**లోకత్రాణ పరాయణత్వమును సంలోకించు షాణ్మాతురా!**

టీక॥ కుత్సితంపుమతిన్ = దుర్బుద్ధితో, కల్లోలంబుగావించి = కలతరేపి, ధేనుముఖవ్యాఘ్రశ్రేణిన్ = గోముఖములతో కూడిన పులులను, చక్కాడి = శిక్షించి, లోకత్రాణపరాయణత్వమును = లోకరక్షణ తత్త్వమును,

తా॥ బుద్ధిమంతులుగా పైకి చెలామణి యగుచు దుర్బుద్ధితో జనుల మధ్య కలతలు రేపి కొంపలు గూల్చెడి గోముఖ వ్యాఘ్రాలను దండించి నీ లోక రక్షణ పరత్వమును నిరూపణ చేసికొనుము.

**111) అరరే, బాహుబలాధికప్రకట గర్వాంధోరుచేతస్కులై**
**పరభాగ్యంబును గుంజి నాచికొనుటే స్వాభావికోన్నత్తులై**
**చిరకాలంబు చరించు దుర్మతులు కాశిన్ గంగలో మున్గినన్**
**పరిహారంబగునే తదీయకృతపాపంబద్ది, షాణ్మాతురా!**

టీక॥ బాహుబల+అధికప్రకట = భుజబలగర్వప్రకటనతో, గర్వ+అంధ+ఉరుచేతస్కులై = గర్వమనెడి అజ్ఞానముతో కూడిన మనస్సులు కలవారై, తదీయకృత = వారిచేతచేయబడిన, నాచికొనుటే = కొల్లగొట్టుటయే, స్వాభావికోన్మత్తులై = సహజముగనే ఉన్మాదులై

తా॥ భుజబలగర్వముతో గర్వాతిరేకముతో అజ్ఞానులై సంచరించుచు ఇతరుల సంపదల కొల్లగొట్టి దోచుకొని కాశికి వెళ్ళి గంగలో మునిగిన పాపములు హరించునా?

**112) మడులన్ నీటిని నింపి యేరయిన కన్మారైన మాత్రాననే**
**మడవల్ దీసి జలంబుద్రోసి పయిరుల్ మాడంగ పోజేసితా**
**రెడదన్ సంతసమూను పోడుముల నీవీక్షింపగాలేద, ఆ**
**చెడుగుల్ గాంతురె 'ముక్తిమార్గమును' సచ్ఛీలంబు వోనాడిపెన్**
**గుడులం గట్టియు పెద్దలంగొలిచియున్ కూపంబులన్ ద్రవ్వియున్**
**కడు సంతర్పణలాచరించియు వృథాగాకేమి? షాణ్మాతురా!**

టీక॥ మడులన్ =మాగాణులలో, ఏరైన = ఎవరైన, కన్మారైనమాత్రాననే = కనుమరుగైనంతలోనే, పోడుములు = సొంపులు, ఈక్షింపగాలేద = చూడలేదా, ఆ చెడుగుల్ = ఆ దుర్మార్గులు, సచ్ఛీలంబు+పోనాడి = మంచి నడవడికను విడనాడి, కూపంబులన్ త్రవ్వియున్ = బావులు త్రవ్వియు.

తా॥ మాగాణిచేలలో నీరుపెట్టి కనుమరుగై పోయినంతనే దుర్మార్గులు మడవలు త్రెంచి చేనిలో చుక్కనీరయిన ఉండనీక పయిరు మాడిపోవునట్లు చేయుచున్నారు. ఇటు చేసిన ఆదుర్మతుల తీరు నీవు చూచితివి గదా. అట్టి దుర్జనులు గుడులు కట్టియు , పెద్దలసేవించియు, నూతులు త్రవ్వియు, సంతర్పణలు చేసియు ముక్తిని పొందగలరా? చేసిన దంతయు వ్యర్థమే యగుచున్నది గదా.

**113) చనినారెందఱొ చక్రవర్తులు ధరన్ శాసించి గర్వైన వెం**
**టను గొంపోయిరె? అమ్మహామహులకన్నన్ మిన్నలై నేడు నె**
**త్తిన శృంగంబులు వీరికిన్ మొలిచెనో, దేహంబె నిత్యంబొ, ఈ**
**ధనమే శాశ్వతమో? మఱేల ధనికుల్ దర్పింత్రు షాణ్మాతురా!**

టీక॥ ధరన్ శాసించి = భూమిని పరిపాలించి, నిత్యంబొ = శాశ్వతమా, శృంగంబులు = కొమ్ములు, దర్పింత్రు = గర్వించెదరు

తా॥ ఎందఱో చక్రవర్తులు లోకాన్ని ఏలి పోయినారు. వారివెంట గవ్వైన తీసికొని పోగలిగినారా? ఈనాటి ధనికులు వారికన్న గొప్పవారా? ఈ దేహముగాని ధనము గాని శాశ్వతములా? ఏల ఈధనికులు గర్వించెదరు?

**114) అధికారంబొకయింత లేనియెడ నాప్యాయంబునన్ బల్కుచున్**
**అధికారం బెదియేని గల్గుతఱి మర్యాదల్‌దిగంద్రావి, అ**
**త్యధమత్వంబున మిన్నుజూచుచును గర్వాంధ్యంబునంబొల్చున**
**ట్టి ధగుల్బాజుల నేమి చేయవలె తండ్రీ, చెప్పు, షాణ్మాతురా!**

టీక॥ అతి+అధమత్వంబున = నీచాతినీచత్వముతో, గర్వ+అంధ్యమ్మునన్+పొల్చు = గర్వమనెడి అంధకారముతో (అజ్ఞానముతో) నొప్పు

తా॥ అధములు అధికారమే లేని సమయమున ఎంతయో ప్రీతితో మాటాడెదరు. అదేదో కొలదిగా అధికారమబ్బినంతనే నింగి జూచుచు మనుజులవైపే చూడరు. స్వామీ, ఇట్టివారి నేమి చేయవలెనో నీవే చెప్పుము.

**115) పరులన్ బాధలొనర్చి బల్ ధనము సంపాదించి ప్రఖ్యాతికై**
**ధర నానావిధరూపహర్మ్యచయమున్ స్థాపించి గర్వించి మో**
**దరసాంభోనిధి మున్గితేలుచు కడుందర్పించు మూఢాత్ములా**
**దరముం బొందుదురేలకో? సకలభూతత్రాణ, షాణ్మాతురా!**

టీక॥ ధరన్ = లోకములో (భూమిలో) నానావిధరూపహర్మ్యచయమున్ =అనేక సుందరరూపముతో నొప్పువేడలసమూహమును, మోదరసాంభోనిధి = సంతోషసాగరమందు, సకలభూతత్రాణ = సకలజీవరాసులను రక్షించువాడా.

తా॥ స్వామీ, ఇతరులను బాధించి ధనార్జన చేసి ప్రసిద్ధివహించుటకై అనేక విధరూపములతో అందాలొలుకు మేడలు గట్టి గర్వించి ఆనందసాగరమున

నోలలాడుమూఢులు సంఘములో విశేషమైన ఆదరణ పొందుట విచిత్రము. దీనిని పరికింపుము.

**116) తన కష్టార్జితమైన యట్టి ధనమున్ తానెట్లొ వెచ్చించి తె**
**ల్లని పుట్టంబెవడేన్ ధరింప కని యొల్లంబోనియీర్ష్యామతిన్**
**కనులన్ నిప్పులు రాల్తురౌర! తమ నాన్నల్ సొత్త దేమో యొకిం**
**తను వెచ్చించినరీతి, దీని గనలేదా, దేవ, షాణ్మాతురా!**

టీక।। తనకష్టార్జితమైన = సొంతడబ్బు, తెల్లని పుట్టంబు = తెల్లని వస్త్రము, ఒల్లంబోని = అంగీకరింపలేని, ఈర్ష్యామతిన్ = ఈసుతోగూడిన బుద్ధితో.

తా।। తనడబ్బుతో ఎవడైన బట్టలు కొని ధరించి పచ్చగా కనిపించినచో ఈర్ష్యాళువులు సహింపలేక కన్నులనిప్పులు రాల్తురు. స్వామీ దీనిని కూడా పరికింపుము.

**117) నిపుణత్వంబుగ నమ్మబల్కి చెలిమిందీపించి కార్యార్థులై**
**ఉపలాలింతురు, కార్యమైన తటి మేలొక్కింతయుం దల్పకే**
**నెపముల్ బన్నుచు సంచరింతురు మహిన్నీచస్వభావాత్ములీ**
**కపటాత్ముల్ ప్రభవింపనేమిటికి? వక్కాణింపు షాణ్మాతురా!**

టీక।। చెలిమిందీపించి = చెలిమిజేసి, కార్యార్థులై = కార్యప్రయోజనము నాశించినవారై, ఉపలాలింతురు = బుజ్జగింతురు. కార్యమైన తటి = కార్యమైన సమయమున.

తా।। నమ్మించి, చెలిమిజేసి కార్యసాధనకై దుష్టులు ఎన్నో విధములుగా ఇచ్చకములాడి బుజ్జగింతురు. కార్యమైనవెంటనే కృతఘ్నులై మెలగుదురు. వీరి జన్మ మెందులకు?

**118) పరుసంబయ్యది సోకగానె యినుమున్ బంగార మౌనట్లు, మీ**
**వరకల్యాణగుణ స్తవంబగుట నేవాక్రుచ్చు నీ పొత్త మం**
**దరయన్ దోసములెన్నియున్ననవి శ్లాఘ్యంబై ధరిత్రీస్థలిన్**
**వరలుంగాదె సమస్త భక్తజన సేవ్యంబౌచు, షాణ్మాతురా!**

టీక॥ పరుసంబు = పరుసవేదియనునది (ఇనుమును బంగారుచేయునది) పొత్తము = పుస్తకము, శ్లాఘ్యంబై = ప్రశంసనీయమై, సమస్తభక్తజనసేవ్యంబు+ఔచు = సకల భక్తజనులచేత సేవింపదగిన దౌచు.

తా॥ దేవా పరుసవేది సోకగానే ఇనుము బంగారమగునట్లు నాయీ కావ్యమున దోషములెన్నియున్నను నీ కల్యాణ గుణములస్తుతించునదిగాన ప్రశంసనీయమై ధరలో భక్తజనసేవ్యమగుచు నొప్పును.

**119) కవితాలక్షణ లక్ష్యకావ్యరచనోత్కర్షాత్ములౌపూర్వపుం**
**గవిరాజుల్ రచియించురీతి శతక గ్రంథంబులంజెప్పినే**
**నవురా! మిమ్ములరింపనేర్తునె, మహాత్మా, బిడ్డలెట్లాడినన్**
**భువి, తండ్రుల్ ముదమందరే, అటులె సంపూర్ణానుకంపామతిన్**
**కవనంబీయదినాది కైకొనుమ, సౌఖ్యంబిమ్ము షాణ్మాతురా!**

టీక॥ కవితా లక్షణలక్ష్య = కవిత్వము యొక్క లక్షణములతోను ఉదాహరణలతోను కూడిన, కావ్యరచనోత్కర్షాత్ములు+ఔ = కావ్యరచనలో నిష్ణాతులయిన, పూర్వము+కవిరాజులు = ప్రాచీన మహాకవులు, సంపూర్ణ+అనుకంపామతిన్ = సంపూర్ణమైన దయా బుద్ధితో

తా॥ దేవా, పూర్వకవులవలె నేను సర్వలక్షణ సంపన్నమైన కవిత్వముతో మిమ్ము మెప్పింపగలనా? మహానుభావా బిడ్డలెట్లు పలికినను తండ్రికి ముద్దేకదా. అట్లు నన్ను మీరు సంపూర్ణమైన దయతో అనుగ్రహించి నాయీ కవితను స్వీకరింపుడు నిత్యానందము నొసగుము.

**120) పరికింపంగను శాస్త్రబద్ధముగ భావంబుల్ సుశబ్దార్థముల్**
**వరలన్ పద్యము చెప్పు చొప్పెఱుగ, మీపాదాంబుజధ్యానత**
**త్పరతంజేసి రచించితిన్ శతక మాతారార్కమై ధాత్రిలో**
**పరగంజేయుమ, భక్తసంతతినుతింపన్, దేవ, షాణ్మాతురా!**

టీక॥ పరికింపంగను = పరిశీలింపగా, శాస్త్రబద్ధముగ = శాస్త్రమునందు చెప్పబడిన విధముగా, సుశబ్ద+అర్థముల్ = మంచి అర్థములతో కూడిన శబ్దములు, ఆతారార్కమై = నక్షత్రములు సూర్యుడు ఉన్నంతవరకు

తా॥ శాస్త్రానుగుణముగ పద్యము చెప్పు విధానము నాకు తెలియదు. మీ పాదధ్యానతత్పరతతో శతకము రచించితిని. ఇది సూర్యచంద్రులు తారకలు ఉన్నంతకాలము ఈలోకమున ప్రసిద్ధి వహించునట్లు భక్తకోటి నుతించునట్లు చేయుము.

**121) ధరలో నీశతకంబు వ్రాసినను నుద్యద్భక్తి నాలించినన్**
**పరమప్రీతి పఠించినన్ జనులు సంభావ్యానుభావాత్ములై**
**దురితంబుల్ బెడబాసి సర్వశుభసందోహంబులన్మించి, మీ**
**కరుణం గాంచి సుఖింతు రంతమున మోక్షంబంది షాణ్మాతురా!**

టీక॥ ఉద్యద్భక్తిన్+ఆలించినన్ = గొప్ప భక్తితో విన్నను, సంభావ్య+అనుభావాత్ములై = అనుభవింపదగిన సమస్త భోగభాగ్యములనుభవించువారై, దురితంబుల్ బెడబాసి = పాపాలను పోగొట్టుకొని.

తా॥ ఈ శతకము వ్రాసినను, భక్తితో విన్నను, ప్రీతితో చదివినను జనులు పాప విదూరులై సకల భోగభాగ్యాలనుభవింతురు. స్వామీ, మీకరుణతో సర్వసుఖములు పొంది తుదకు మోక్షమును పొందుదురు.

**122) శ్రీ రంజిల్లు అగస్త్యరెడ్డ్యభిజన క్షీరాబ్ధి సంపూర్ణ నీ**
**హారాంశుండను, వెంకురెడ్డియను నాఖ్యాకుండ రాజమ్మకున్**
**సారోదారుడు కాశిరెడ్డికి సుతుండన్ దేవ, మీ భక్తుడన్**
**గారామూరగ దీని జేకొనుమ మోక్షంబిమ్ము షాణ్మాతురా!**

టీక॥ శ్రీరంజిల్లు = సంపదలతో ప్రకాశించు, అగస్త్యరెడ్డి+అభిజనక్షీరాబ్ధి = అగస్త్యరెడ్డి వంశమను పాలసముద్రమునకు, సంపూర్ణనీహారాంశుండను = పూర్ణచంద్రుడను. ఆఖ్యుండ = పేరుగలవాడను, గారామూరగ = ప్రీతిగా

తా॥ అగస్త్యరెడ్డి వంశము సర్వసంపదలకు నిలయము. అట్టి వంశమను

పాలసముద్రమునకు నేను సంపూర్ణచంద్రుడను. నాపేరు వెంకురెడ్డి, రాజమ్మకు కాశిరెడ్డికి తనయుడను. దేవా, కుమారస్వామీ, మీ భక్తుడను. ప్రీతి పూర్వకముగా ఈ కావ్యమును స్వీకరించి ముక్తి నొసగుము.

ఓం తత్సత్